జూన్ - 1997

వెల - రూ|| 6/-

# మిసిమి

మాస పత్రిక





## దామెర్ల రామారావు
**(1897 - 1925)**

ఇరవయ్యో శతాబ్దిలోనే ఆంధ్రలో పునర్వికాస యుగం ఆరంభమైంది. ఈ పునర్వికాసయుగం అందించిన అమూల్యమైన కానుకలలో ఒకటి ''ఆధునిక ఆంధ్రచిత్రకళ''. ఈశతాబ్దిలో మన జాతి పొందిన బౌద్ధిక స్పృహ, నూతన గతిశీలత, ఔద్వేగిక స్ఫూర్తిల నుంచి ఈకళ నిష్పన్నమైంది. దీనికి ముఖ్యంగా స్ఫూర్తి రాజమండ్రిలోని ఒ.జె. కౌల్డ్రీ, మచిలీపట్టణంలోని ప్రమోద్‌కుమార్ ఛటర్జీల నుంచి లభించింది. రాజమండ్రిలోని రామారావు ఆర్ట్ స్కూలు తనదైన విశిష్ట శైలిని సంతరించుకొంది. రామారావు రూపుదిద్దిన ఒరవడిలో ఎంతోమంది తమ కళాభినివేశాన్ని ప్రవహింప జేసుకొని ఉత్తీర్ణులయ్యారు. రామారావు ఆంధ్రదేశమే కాదు, భారతదేశమే కాదు, ప్రపంచకళా ప్రపంచమే గర్వించ దగిన కళాకారుడు.

# మిసిమి

"All that we are is the product of what we have thought" is "We are what we think." — Dammapada.

సంపుటి 9 | జూన్ 1997 | సంచిక 5

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ **రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయసూచిక



విడిప్రతి రూ. 6/- వార్షిక చందా రూ. 70/-

ముఖచిత్రం : సిద్ధార్థుని రాగోదయం - దామెర్ల రామారావు

Printed, Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd., 1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7612436, 7612337.

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

# Return of the prodigal

D H Lawrence is finally back with the university that disowned its most famous student after he eloped with his professor's wife, writes DAVID CHARTER

D H LAWRENCE has finally been welcomed back into the university which disowned its most famous student after he eloped with his professor's wife.

An extensive archive of manuscripts, rare editions and letters, acknowledged to be the world's finest private collection of Lawrence material, has been beqeathed to Nottingham University. The collection, numbering 1,400 items and thought to be worth $1.5 million , was built up by George Lazrus, a gold share dealer who made a fortune in the family firm, Lazarus Brothers.

His gift completes the reconciliation between the author and the city he famously dismissed as "that dismal town". It is now certain to become one of the world's leading centres for Lawrence studies

Among the collection are previously unpublished letters which disclose that Nottingham's prodigal son was coy even with his family about the contents of his most notorious novel, Lady Chatterley's Lover In 1928 he tried to steer his sister Emily away from reading the copy he felt duty-bound to send her from his home in Italy. "I would not bother to read it, you will find it rather heavy" , he wrote, adding that if she left it with the pages uncut "it would be more valuable"

His words proved prophetic. Lawrence's popularity, together with the auction-room price of first editions, soared after the sensational obscenity trial over Lady Chatterley's Lover 30 years after his death. Although scholars believe Emily took his advice, her daughter split the pages and read the book from cover to cover.

Many of the letters in the collection were written after Lawrence's death by Frieda Weekly, nee von Richthofen, the "strikingly beautiful" German who became his wife in 1914 Lawerence decided to leave for Germany in 1912 after qutting teaching, the career he had prepared for at the then University College, Nottingham, from 1906-08. He arranged to meet his former tutor, Ernest Weekley, professor of modern languages, who was to provide him with contacts on the Continent. However it was the professor's wife with whom he began a scandalous liaison that rocked the college. Lawerence was for years persona non grata who stayed fiercely loyal to Weekley.

*(Continued on page 151)*

# కల్పనకు ఒక ప్రశంస

క్యామిలా జోసీలా (1989) — సంక్షిప్త అనువాదం : బి. తిరుపతిరావు

నా మిత్రుడు, సలహాదారు అయిన [illegible] గోడగడియారం చుట్టూ ఒక అద్భుతవాక్యం పర్చుకుని వుంది. అది ఒక సూక్తి. గడియారం ముల్లు కదులుతూవుండగా మనం ఆ సూక్తిని చూస్తే, మన హృదయంలో [illegible]యని అలజడి మొదలవుతుంది ''ప్రతి గంట గాయపర్చుతుంది ఆఖరి గంట హత్య చేస్తుంది.'' అనేదే ఆసూక్తి. ఎప్పుడూ వెనక్కి నడవని గడియారంలోని ముల్లు నాహృదయంలోనూ, ఆత్మలో [illegible]ధ్వనిస్తూవుంటుంది. సుదీర్ఘమయిన నాగతంలో ఒక పాదాన్ని, భవిష్యత్తు మీద ఆశలో ఇంకో పాదాన్ని పెట్టి, మౌఖిక పదాన్నిగురించి కొన్ని మాటలుచెపుదామని, అలాగే స్వేచ్ఛ, సాహిత్యాలగురించి మాట్లాడదామని, మీ ముందుకు వచ్చాను. ఒక వ్యక్తి ముసలితనంలోకి ఎప్పుడు ప్రవేశిస్తాడో నాకు తెలియదు కాని, ప్రస్తుతానికి డాన్ ఫ్రాన్సిస్కో డి క్యూవెడో మాటల్ని ఆసరాగా తెచ్చుకుంటాను. ఆయన ఇట్లా అంటాడు ''పండుముసలితనం లోకి చేరుకోవాలని మనమంతా అనుకుంటాం, కానీ మనం ఇప్పటికే ఆదశలో వున్నాం అని ఎవరూ అంగీకరించరు''

ప్రత్యక్షంగా కనిపించేదాన్ని ఎవరూ కాదనలేరు. కాలం చాలా కఠోరంగా నిర్దయగా నడిచిపోతుంది. నాకు తెలుసు. ప్రేరణకోసమో, మెరుగులకోసమో చూడకుండా నేను చెప్పాలనుకున్న దేదో చెపుతాను, మీ ముందు ఇలా ఈ వేదిక మీద నిలబడి. చేరుకోవటం ఎంతో కష్టమయిన ఈ వేదిక మీద నిలబడి మాట్లాడటం నాకెంతో ఆశ్చర్యంగా వుంది. నా రచనలు, మీరు నాకు ఇచ్చినా గౌరవం కంటె గొప్పవి కావు. స్పానిష్ భాష దేవుడిచ్చిన వరం. స్పెయిన్ ప్రజలు దాన్ని అలాగే స్వీకరించారు. మీరిచ్చిన బహుమానం దీప్తిమంతమయిన ఆ భాషకే కాని, ఆ భాష వ్యక్తం చేయగల్గినదంతా వ్యక్తం చేయించటానికి ఉపయోగించిన మామూలు రచయితకి కాదనే భావం నాకు ఆనందదాయకం.

నేను ఒంటరి తనం నుంచి రాస్తాను. ఓంటరి తనం నుంచి మాట్లాడ తాను. ఒకే కాలంలో మాటియో అలమాన్, ఫ్రాన్సిస్ బేకన్‌లు ఇద్దరూ గూడా, ఒంటరి తనాన్ని ఆ కాంక్షించే మనిషిలో దైవత్వం, జంతులక్షణమూ రెండూ వుంటాయని అభిప్రాయపడ్డారు. సరే, నేను మాత్రం ఒంటరితనాన్ని కాంక్షించలేదు కాని కనుగొన్నాను. ఆ ఒంటరి తనతోనే నేను ఆలోచిస్తాను, పనిచేస్తాను, జీవిస్తాను. ఏ గొప్ప కళాఖండమూ ఒక గొప్ప ఏకాంతం లేకుండా, అస్తిత్వంలోకి రాదన్న నా మిత్రుడు పికాసో మాటల్ని నేను ఎప్పుడు గుర్తుంచుకొంటాను.

మనిషిని నిర్వచించటంలో తాత్వికులు విభిన్నతా మాధ్యమాన్ని వాడుతూ వచ్చారు. అరిస్టాటిల్ 'మనిషి రాజకీయ జీవి' అన్నా, డెకార్టే ఆలోచనాజీవి అన్నా, అన్నింటిలోనూ మనిషిని జంతువులనుండి వేరు చేసి చూడటమే కన్పిస్తుంది. మానవ ప్రవృత్తికి మూలాధారం భాష అనటానికకావలసినన్ని ఆధారాలు వున్నాయనినేనుకుంటాను. ఈ ప్రవృత్తే మనల్ని జంతువులనుండి వేరుపర్చుతుంది. డార్విన్‌చెప్పిన తరువాత, మనం జంతువులనుండి రూపొందామని నమ్ముతున్నా, మనం జంతువులకి భిన్నంగా వున్నాం. భాషే పరిణామం మనం విస్మరించలేని ఒక వాస్తవం.

★ **బి. తిరుపతి రావు** విజయవాడ సిద్ధార్థ సైన్స్ అండ్ ఆర్ట్స్ కళాశాలలో ఆంగ్లశాఖలో ఉపన్యాసకులుగా పనిచేస్తున్నారు. ప్రసిద్ధ సాహిత్ విమర్శకులు.

''మనిషే అన్నింటికీ కొలబద్ద'' అంటాడు ప్రొటాగరస్ మనిషే అన్నింటికి ఎందులో కొలబద్ధ, ఎలాకొలబద్ధ, ఎందుకు కొలబద్ద అవుతాడు, ఎందుకుకాడు, అనేవి కీలకమైన అంశాలు పదాలకు కూడా ఇదే వర్తిస్తుంది ప్రేమనేది లేకుండా ద్వేషం లేదు విభిన్నత ఇక్కడ ముఖ్యం మనిషివస్తువులతో తలపడతాడు లేక అవి అతనికి ఇవ్వబడతాయి వస్తువులను సంకేతీకరించటం అనేది అడవిలో నీటిబుగ్గకాదు, మనిషి తవ్వుకున్న బావి. విక్టర్ హెన్రీ ప్రకారం మనిషి వస్తువులకి పేర్లు పెట్టగలడు, తిరిగి వాటిని తీసుకోలేడు, భాషను మార్చగలడు, కాని తనకిష్టమొచ్చిన పద్ధతిలో మార్చలేడు.

ఆలోచన అంతర్గంగానే భాషతో జతకలసి వుంటుంది స్వేచ్ఛకుడా భాష, భావనాత్మక క్రమాలతో కూడి వుంటుంది. ఈ రెండూ కలసి మనిషి సాహసాలకి కావలసిన విశాల చట్రాన్ని అందిస్తాయి మానవ సరిహద్దుల్ని కనుగొని విస్తరించేవాళ్ళే మనిషి స్థాయిని మార్చాలనుకునే వాళ్ళు కూడా ఆలోచన, స్వేచ్ఛ రెండూ నాయకుల్లోనూ, ప్రతినాయకుల్లోనూ ఒకే రకంగా వుంటుంది.

స్వేచ్ఛగా వుంటూ ఆలోచించటం అంటే ఏమిటి? మనిషి ఆలోచించటం అంటే స్వేచ్ఛగా వుండటం గురించి ఆలోచించటమే స్వేచ్ఛ అనేది నిర్దిష్టమైందా? లేక మనస్సులో పుట్టే ఒట్టి ఆలోచనేనా? అనేదాన్ని గురించి చాలా చర్చ జరిగింది. అయితే అటువంటి చర్చ నిరర్థకం. స్వేచ్ఛ గురించిన వాస్తవ ఆలోచన, భ్రమజనిత ఆలోచన రెండు ఒకటే అంటాడు ఒక స్పానిష్ తాత్వికుడు. మనిషికి స్వేచ్ఛ లేకపోతే, మానసిక, శారీరక, సామాజిక శాస్త్ర, చరిత్ర సంకెళ్ళలో తనుంటే, ఆ మనిషి తనతో పాటు ఆ భావాన్ని మోసుకుపోతూవుంటాడు మనం స్వేచ్ఛగా వుండాలనుకుంటే మనం స్వేచ్ఛగా వుంటే ఎలా వుంటామో అలా, మన ప్రపంచాన్ని రూపొందించుకుంటాము.

భవన నిర్మాణ నమూనాతో మనం నిర్మించాలనకున్న సమాజంలో మానవ స్వేచ్ఛ అనే సూత్రం వుంది. ఈ సూత్రపు వెలుగులోనే మనం ఒక అంశాన్ని కీర్తిస్తాం, గౌరవిస్తాం, ఖండిస్తాం, బాధపడతాం మన నీతి చట్టాలలోనూ, న్యాయసూత్రాలలోనూ, రాజకీయ సూత్రాలలోనూ స్వేచ్ఛావలయమే కన్పిస్తుంది.

మనం ఆలోచిస్తాం అనే విషయం మనకు తెలుసు మనం స్వేచ్ఛగా వున్నాం కాబట్టే ఆలోచించగలుగుతున్నాం. ఆలోచనకి స్వేచ్ఛకు అవినాభావ సంబంధం వుంది. స్వేచ్ఛ ఆలోచనకి షరతు ఆలోచన ద్వారానే మనిషి ప్రకృతి సూత్రాలనుండి కావాలనుకున్నంతగా తనని తాను వేరు చేసుకోగలడు. ఈ సూత్రాలను తాను ఆమోదించగలడు, వాటికి లొంగికూడా వుండగలడు. ఆలోచనా ప్రపంచంలో తర్కంతో పాటు అసంబద్ధత కూడా అని వార్యంగా వుంటుంది. కారణం, మనిషి ఎప్పుడూ వాస్తవమైన, సాధ్యమైన అంశాలను గురించి మాత్రమే ఆలోచించక పోవటం. మనస్సు తన ఆలోచనా స్రవంతిని వేయి ముక్కలు చేసుకుని మళ్ళీ ఆశకలాల్ని ఒక కొత్త రూపంలోకి అతుక్కుంటుంది. ఒకవ్యక్తికి ప్రపంచాన్ని గురించి అనుభవసిద్ధత మీద ఆదారపడ్డ అనేకహేతుబద్ధ ఆలోచనలు వుండవచ్చు అయితే ఆలోచించే వ్యక్తికి స్వేచ్ఛ ఎప్పుడూ ప్రాతిపదికగా వుంటుంది. ఈ సంకుచిత అర్థంలో స్వేచ్ఛాపూరిత ఆలోచన అనేది అనుభవసిద్ధ ప్రపంచానికి వ్యతిరేకంగా వుండి తన రూపాన్ని కల్పితకథల్లో ఆవిష్కరిస్తూవుంటుంది. కల్పితకథల సృష్టి

అనేది మనిషిసామర్థ్యంలో మూడవ అంశం, మిగతా రెండు : ఆలోచన, భాషలు ఈ సామర్థ్యం కల్పితకథల్లోకి రావటానికి ముందు సత్యాలు కాని వాటిని కూడా కల్పిత కథల్లో సత్యాలుగా మార్చగలుగుతుంది.

ఆలోచనా క్రమం ద్వారానే మనిషి ప్రపంచంలో దాగివున్న అంశాల్ని కనుగొనటం ప్రారంభిస్తాడు కల్పితకథలు అనే మాధ్యమంద్వారా తనదైన విభిన్నమైన ప్రపంచాన్ని సృష్టిస్తాడు మనిషి. ఈ విధంగా సత్యం, ఆలోచన, స్వేచ్ఛ, కల్పిత కథ అనేవి సంక్లిష్టమైన అంతర్గత సంబంధాల్లో వుంటాయి ఒక్కొక్కసారి అనుమానాస్పద సంబంధంలో కూడా వుంటాయి. ఇది ఒక రకంగా అనేక అడ్డదారులతో కూడిన చీకటి దారి. అయితే సాహసాల మార్గంలో ఇబ్బందులు అనివార్యం.

కల్పిత కథ, శాస్త్ర సత్యం అనేవి అలోచనా రూపాలు కావు ఇవి రెండు ఒక దానితో ఒకటి పోల్చటానిక వీలులేని విభిన్న అంశాలు ఈ రెండు విభిన్నమైన సూత్రాలకి, పద్ధతులకి లోబడి వుంటాయి స్వేచ్ఛ భావాన్ని నిరాకరించి మనిషిని బందీని చేయటంలో ఏకం అయ్యే శాస్త్ర, సాహిత్యాల్ని వేరుచేసి చూడటం అవసరం మనిషిలో ఆశను ధ్వంసం చేసే శాస్త్ర, సాహిత్యాల్ని మనం ధ్వంసం చెయ్యాలి. మానవ స్వేచ్ఛ పట్ల అచంచల విశ్వాసమే మనం పురోగమిస్తున్నా మనటానికి గీటురాయి అయితే స్వేచ్ఛ పట్ల ఉత్త విశ్వాసం సరిపోదు. సైన్స్, స్వేచ్ఛా వాంఛని తీర్చలేదని మనం అనుభవం ద్వారా గ్రహించాం నిజానికి సైన్స్ మానవ ఇచ్ఛా, వాంఛలకి అనుగుణంగా నడవాలి

కామిలో జోసిసెలా 1916 మే 11న మాడ్రిడ్, స్పెయిన్‌లో కామిలో సెలా వైఫెర్నాండెజ్, కామిలా ఇమాన్యులా ట్రలోక్ వైబర్టొరిని దంపతులకు జన్మించాడు. చిన్నతనం నుంచి ఆయన ఆరోగ్యం అంతమంచిది గాదు. మాడ్రిడ్ కేంద్ర విశ్వవిద్యాలయంలో వైద్యం, న్యాయం, తత్త్వశాస్త్రాలను అభ్యసించాడు. అయితే ఆయన అభిమాన విషయం సాహిత్యం. ఆయన మొదటి రచన ఆత్మకథ, ఒకచిన్న పద్యం. రెండూ ఆర్జెంటినో అనే దిన పత్రికలో 1933లో ప్రచురితమయ్యాయి. ఆతరువాత అనేక పద్యాలు రాశాడు. Treading Dubious Daylight అనే గ్రంథంలో 1945లో ప్రచురితమయ్యాయి.

1940ల్లో చాలాదారిద్ర్యాన్ని అనుభవించాడు, La Colemena (The Hive) అనే నవల అతని రచనలలో కెల్లా అత్యంత ప్రతిభావంతమైంది. 1951లో ఆర్జెంటీనాలో అచ్చయింది. స్పెయిన్‌లో 1962 వరకు దీనికి అనుమతి ఇవ్వలేదు. 1953లో ''అగమ్యగమనం'' (పొందరాని వారిపొందు) మీద 'శ్రీమతి కాల్డ్‌వెల్ తన పుత్రునితో మాట్లాడుతుంది, ("Mrs. Caldwell Speaks to her Son") అనే శీర్షికతో అధివాస్తవ అధ్యయనం చేశాడు. సవాలు చేసే మానవుని బలహీనతా దృశ్యాన్ని కన్నుల కట్టే, సంయమిత కరుణాయుత సుసంపన్న గాథ వచనం రాసినందుకు బహుమతి ఇచ్చారు.

– సంపాదకుడు

కల్పితకథల్ని సృష్టించే సాధనంగా సాహిత్యం రెండు మౌలిక పునాదుల మీద ఆదారపడివుంది. వీటిల్లో మొదటిది సౌందర్యశాస్త్రం ఇది కవిత్వం, వ్యాసం, నాటకం మొదలయిన కళారూపాల మీద నిర్దిష్ట ప్రమాణాల్ని విధించి, సాహిత్యేతర అంశాలనుంచి సాహిత్యాన్ని వేరుచేసి చూపుతుంది.

కళాత్మకత మాత్రమే పాఠకుడిలో అనుభూతుల్ని రేకెత్తించగలుగుతుంది సోషలిస్టు వాస్తవికత నుంచి ప్రయోగాత్మక రచనల దాకా అన్నింటిలోనూ కళాత్మక అంశం అనివార్యంగా వుండాలి ఇక రెండవది నీతి శాస్త్రం లేక నైతిక దృష్టి సౌందర్య శాస్త్రం, నైతిక దృష్టి రెండు ఒకటి కాదు, వీటి విలువలు కూడా ఒకటికాదు. సాహిత్యం ఈ రెండింటినీ సమతౌల్య స్థితిలో వుంచగలుగుతుంది

నైతిక దృష్టి సాహిత్యాన్ని విలువైందిగా మార్చగలుగుతుందని నానమ్మకం. కల్పిత కథల్ని కూడా ఈ సూత్రమే శక్తిమంతం చేస్తుంది. ఒక రచయిత నైతిక నిబద్ధతకి స్వేచ్ఛ గురించిన అతని భావానికి సంబంధం వుంది ఎంత తెలివయిన రచయిత అయినా తన మానవతని దాటిపోలేడు ఆ రచయితలో తప్పులు వుండవచ్చు. స్వేచ్ఛకి సంబంధించిన గ్రుడ్డి విశ్వాసాలూ వుండవచ్చు ఏ రచయితకూడా కళాత్మక దృష్టిని వాచక పుస్తకాల ద్వారా నేర్చుకోలేడు. సాహిత్య కల్పిత కథారచన నైతికదృష్టి, కళాత్మక దృష్టిపట్ల నిబద్ధతతో నడవాలి. మనిషి నిరంతరం మారుతూ వుంటాడు, మార్పు హింసాత్మకంగా కూడా వుంటుంది. అందువల్ల నైతిక, కళాత్మక ప్రకంపనల్ని ముందే ఊహించటం కష్టం. కొంతమంది రచయితలు తమయుగస్వభావంలోకి, అనుభవంలోకి ప్రవేశించి రచనచేసి గొప్పరచయితలుగా ముందుకు వస్తారు కొంతమంది రచయితలు మార్గం స్పష్టంగా తెలియక పోయినా స్వేచ్ఛని, మానవ సృజనాత్మకతని మరింత ముందుకు తీసుకు పోతారు, అందుకోసమే రచన చేస్తారు సాహిత్యం ఇలాగే తన పాత్రని నిర్వర్తించ గలుగుతుంది. ఇదే నిజమైన సాహిత్యం.

కల్పితకథ ఊహాజనిత సిద్ధాంతాల జెండాలని మరే ఇతర ఆలోచనా రూపాలకంటె గూడా శక్తిమంతంగా ఎగురవేయగలుగుతుంది. అందువల్లే రాజకీయ తాత్వికులు సాహిత్య కథల్ని తమ ఊహజనిత సిద్ధాంతాల రూపకల్పనికి ఆధారం చేసుకున్నారు. ఈ సిద్ధాంతం వేరు రూపంలో వ్యక్తపర్చబడినట్లయితే అంగీకరింప బడివుండి వుండేవి కావు. కల్పిత కథల్లో ఊహజనితవాదానికి అంతులేదు. నిజానికి కల్పిత కథలకి పునాది ఊహాజనితవాదమే అంతమాత్రం చేత కల్పిత కథలు ఊహజనిత అంశాలకి మాత్రమే పరిమితం కాదు. సృజనాత్మక ఆలోచనల్లోని అసంబద్ధతల్ని కూడా కల్పితకథలు బహిర్గతం చేయగలవు

ఒక ప్రయోగశాల పాత్రని సాహిత్య సైన్స్ ఫిక్షన్‌లో నిర్వర్తించ గలుగుతుంది. ఈ రచనల్లోని భవిష్యత్తుకు సంబంధించిన ఊహలు చాలా సందర్భాలలో వాస్తవీకరింపబడ్డాయి దీన్ని అనేకమంది విమర్శకులు కీర్తించారు కూడా. కల్పిత కథల గొప్పదనం భవిష్యత్తుకు సంబంధించిన ప్రపంచాన్ని బహుముఖంగా ప్రదర్శించటంలో వుంది

డాన్‌కిగ్జొటీలు, ఓథెల్లోలు, డాన్‌జాన్‌ల కల్పిత కథ ఒక చదరంగ క్రీడ అనే విషయాన్ని రుజువు చేస్తారు కవి అనేవాడు లేకుండా షైక్రాలాక్ ప్రదర్శించిన తంత్రం ముందుకు వచ్చివుండేది కాదు. సమాజంలో తన్నుకువచ్చే తరంగాలకి రచయిత జల్లెడలాగా పనిచేస్తాడు. మనలో వుండే దైవ సంబంధమైన వాంఛలకి వ్యక్తీకరణ కల్పిత కథల్లోనే సాధ్యమవుతుంది. హోమర్ కాలం నుంచీ మనం చూస్తూవున్నది దీనినే. మానవ ప్రయత్నం మనిషికి మరింత హేతువుని అందించింది. ప్రయత్నం, భావుకతల ద్వారానే మనిషి మనుషిగా ఎదుగుతాడు సాహిత్యకల్పిత కథ అన్ని సందర్భాలలోనూ నిర్ణయాత్మక అయుధంగా వుంటూ వచ్చింది. స్వేచ్ఛ కోసం జరిగే యాత్రలో ఈ ఆయుధం మార్గన్ని తొలుచుకుంటూ పోతుంది.

# చిరస్మరణీయుడు - దామెర్ల

(ప్రసిద్ధచిత్రకారులు దామెర్ల రామారావుగారు జన్మించి వందసంవత్సరాలు నిండిన సందర్భంగా)

- మాకినీడి సూర్యభాస్కర్

ఇరవయ్యవ శతాబ్దం భారతీయ చిత్రకళా పునరుజ్జీవనానికి నాంది పలికి, దాన్ని ఉద్యమంగా తీర్చి దిద్దింది. ఈ. పునరుజ్జీవనంలో మొదటి అడుగు బెంగాల్‌దే డా. అవనీంద్రనాథ్‌టాగోర్ దీనికి శ్రీకారం చుట్టగా హావెల్ మొదలైనవారు ఆ శైలిని కొనసాగించారు.

ఆంధ్రప్రదేశంలో కూడ ఈ ఉద్యమం పొడసూపి, మూడు ప్రధాన శైలుల్లో సాగింది. వీటిలో రెండు బెంగాలు శాఖలు కాగా, ఒకటి బొంబాయి శాఖ ఈ బొంబాయి శాఖ ఒరవడి దిద్దిందీ, పరపతి తెచ్చిందీ దామెర్ల రామారావు గారు. శైలి బొంబాయిదైనా, వీరు తమ చిత్రరచనలో తెలుగు రూపాలను, తెలుగు వాతావరణాన్ని చిత్రించారు. వీరి సాంప్రదాయం కొంత పాశ్చాత్యం, కొంత భారతీయం - రెండు విధానాల మేలు కలయిక. పాశ్చాత్యుల వాస్తవిక వాదాన్ని ప్రాచ్యుల భావప్రాధాన్య ఆదర్శవాదంతో మేళవించి రచించిన వీరి చిత్రాలలో రూపపుష్టి మెండు. రేఖాచిత్రాలు, కేవల వర్ణచిత్రాలు, సరేఖీయవర్ణచిత్రాలు - మూడు విధాల చిత్రాలనూ ఆయన రచించారు. శుద్ధ రేఖాంకన చిత్రాలు ఎంత సరళ నిసర్గమో, వర్ణచిత్రాలు అంత రూపమాధురితో అలరారుతాయి. అయితే, చాల చిత్రాలు రేఖారంగుల సమ్మేళనా రచితాలు....రత్న ఖచితాలు. వాస్తవికరీతితో భారతీయ రూపలావణ్యం జత కలిసి, పాశ్చాత్య వర్ణ సామరస్యంతో అలరారే వీరి సామూహిక రచనల్లో (Group compositions) వర్ణమిశ్రమం పారదర్శకతకు నిలవై చిత్రానికి కమనీయమైన దృశ్యస్పర్శకతను (Visual texture)కలిగిస్తుంది ఇదీ స్థూలంగా దామెర్ల వారి చిత్రరచనా సంవిధాన చిత్రణం, వర్ణసమ్మేళనా వర్ణనం.

దామెర్ల రామారావుగారు 1897వ సంవత్సరం మార్చినెల 8వ తేదీన జన్మించారు. వీరి తల్లిదండ్రులు శ్రీమతి లక్ష్మీదేవమ్మ, శ్రీ దామెర్ల వెంకటరమణ. మశూచి వ్యాధి సోకి 28యేళ్ల చిరుతప్రాయంలోనే 1925ఫిబ్రవరి 6వ తేదీన మరణించినప్పటికీ, ఆ స్వల్పకాలంలోనే భారతదేశానికి... ముఖ్యంగా ఆంధ్రదేశానికి ఎనలేని కీర్తిప్రతిష్ఠలను సముపార్జించి పెట్టారు. రాజమహేంద్రవరంలో స్థిరపడి, స్వీయ చిత్రాగారమును నెలకొల్పి, అపారమైన కృషిసల్పి, స్వతంత్రంగా ఒక చిత్రకళాసంప్రదాయాన్నే సృష్టించిన సంకల్పబలుడాయన.

సుప్రసిద్ధ చిత్రకారలు ఏ. ఎస్.రామ్‌గారి డ్రామా థియేటరు కర్టెను పెయింటింగ్స్‌కు ప్రభావితులైన రామారావుగారిని కీ.శే. ఓ.జె కూల్డ్రే దొరగారు (రాజమండ్రి) (గవర్నమెంటు

---

★ **మాకినీడి సూర్య భాస్కర్** చిత్రకారులు. కళా విమర్శకులు నివాసం కాకినాడ

కాలేజి ప్రిన్సిపాలు, రాజమండ్రిలోనే ఒక చిత్రకళాభ్యసనశాలను నడిపేవారు) బొంబాయిలోని సర్ జె.జె స్కూల్ ఆఫ్ ఆర్ట్స్‌కు పంపించడం, అక్కడ ఈయన ప్రతిభను గుర్తించిన ఆ కళాశాల ప్రిన్సిపాల్ బరన్సుదొరగారు ఈయనను అన్నివిధాల తీర్చిదిద్దడం మనం చేసుకున్న అదృష్టం. అంతేకాక, రామారావుగారి కుటుంబ సభ్యులందరు చిత్రకళాభ్యాసన పట్ల ఆయనను ప్రేరేపించడం ఆయన కళాసాధనను ద్విగుణీకృతం చేసింది ఒకసారి రామారావుగారు కుక్కగొడుగును ఒక జతబూట్లతో పోలుస్తూ చిత్రించిన స్టిల్‌లైఫ్‌ను కూట్లేకు చూపారు అయితే, కూట్లే దాన్ని చూచి ఆనందించకపోగా, ''కుక్కగొడుగుకు బదులుగా దేశవాళీ తాటాకుల గొడుగును చిత్రించవలసింది'' అంటూ సూచించారు ఈ విమర్శే రామారావుగారిని తనదైన స్వంత బాణీకి ప్రోత్సహించింది 1915వ సంవత్సరంలో రాజమండ్రి పట్టణంలో ప్రముఖచిత్రకారులు కీ.శే.వరదావెంకటరత్నం, చామకూర భాష్యకార్లు, చామకూర సత్యనారాయణ, శ్రీ ఎమ్. ఎస్.ప్రకాశరావు గార్లతో కూడి 'ఫైన్ ఆర్ట్స్ సొసైటీ' అనే సంస్థను రామారావుగారు స్థాపించారు.

చిత్రకళలో నైపుణ్యాన్ని పెంచుకొనేందుకు రామారావుగారు విరివిగా పర్యటించడం, పేరు పొందిన చిత్రకారులను కలవడం చేస్తుండేవారు. 1918 లో అజంతా, ఎల్లోరా, ఎలిఫెంటా, నాసిక్ మొదలైన చిత్రకళాస్థానాలను దర్శించారు. భావనగర్, ద్వారక మొదలగు పట్టణాలను దర్శించారు భావనగర్‌లో ఉన్నపుడు రవీంద్రకవీంద్రులు అక్కడకు రాగా, రామారావుగారు వారిని దర్శించి పదేపది నిమషాలలో ఆయన రూపాన్ని చిత్రించి చూపారు. టాగూర్ వారి చిత్రకళానైపుణ్యానకి అబ్బురపడి, ''ప్రపంచంలో కెల్లా గొప్పచిత్రకారుడవు కాగల''వని దీవించారు. టాగూర్ ప్రశంసలందిన ఆ పోర్ట్రయిట్ గేలరీలో ఇప్పటికీ ఉంది.

1921లో రామారావుగారు జగన్నాథం, భువనేశ్వరం మొదలైన క్షేత్రాలను దర్శించారు కలకత్తాలోని బెంగాలు కళాకేంద్రాన్ని పరిశీలించడానికి వెళ్లి, కొన్ని రోజుల పాటు అక్కడే ఉండి, అవనీంద్రనాథ్‌టాగూర్‌ను, ప్రమోదకుమార ఛటోపాధ్యాయ, యింకా ఇతర ప్రసిద్ధ చిత్రకారులను కలిసి వారి రచనా సంవిధానాలనూ, పద్ధతులనూ పరిశీలించారు.

1922వ లో రాజమండ్రిలో ఆంధ్ర భారతీయ చిత్రకళాపరిషత్‌ను స్థాపించి రెండు విధాలుగా చిత్రకళామ తల్లిని సేవించారు. హిందూ పురాణేతిహాస, సంప్రదాయ, సాంస్కృతిక శైలిలో చిత్రాలను రచిస్తూ కొందరి చిత్రకారులను ఆంధ్రదేశానికి అందించే కృషి చేసారు. వరదా వెంకటరత్నం, భార్య శ్రీమతి సత్యవాణి, సోదరి శ్రీమతి బుచ్చికృష్ణమ్మ, చామకూర సత్యనారాయణ, వరాహగిరి వెంకట భగీరధి మొదలగు వారు రామారావుగారి ముఖ్య శిష్యులు. వీరు, వీరి ప్రశిష్యులూ నేటికీ చిత్రరచనలో రామారావుగారి సంప్రదాయాన్ని కొనసాగిస్తున్నారు.

రామారావుగారి చిత్రాలలో ఎక్కువగా పల్లెదృశ్యాలు, పల్లెపడతుల భంగిమలు దర్శనమిస్తాయి బావినుంచి నీరు తోడుతోన్న స్త్రీలు, పట్టుకెళ్తున్న స్త్రీలు మనకు కనిపిస్తారు 'బావివద్ద', 'కార్తీకపౌర్ణమి', 'పుష్పాలంకరణ', 'శ్రీరామ వనవాసము', 'సిద్ధార్థరాగోదయము', కొన్ని ప్రకృతి చిత్రాలు, మరికొన్ని నగ్నచిత్రాలు చాల అద్భుతమైనవి ప్రకృతి అందాలకు ఇంకా మెరుగులు దిద్ది ద్విగుణీకృతం చేసారు రామారావుగారు తమ ప్రకృతి చిత్రాలలో వీటిలో సాగరతీర చిత్రాలు మరీ అద్భుతమైనవి సంస్కృతాంధ్ర కవులనేకులు సృష్టించిన ప్రబంధనాయికలైన పద్మినీ జాతి స్త్రీల సౌకుమార్యాన్ని, సౌందర్యాన్ని, సహజత్వాన్ని మన కట్టెదుట నిలుపుతాయి వారి నగ్నచిత్రాలు. దామెర్ల కళాక్షేత్రంలో ప్రత్యేకంగా ఒక గదిలోనున్న, రామారావుగారు రచించిన తొలినాళ్లవైన ఈ నగ్నచిత్రాల శైలి, వర్ణవిన్యాసాలలో రాజారవివర్మ ప్రభావం ఎంతో కనిపిస్తుంది మానవశరీర నిర్మాణము, చేతులు, వ్రేళ్ళ తీరు చిత్రీకరణ రవివర్మను గుర్తుకు తెచ్చినా, కొంత వైవిధ్యము ఉంది రవివర్మ రొమాంటిసిజాన్ని రామారావుగారు తిరస్కరించారు వాస్తవికతను చిత్రించిన ఆదర్శవాది రామారావుగారు ఆయన ప్రపంచం సాధారణ ప్రజాజీవనం

'సిద్ధార్థ రాగోదయం' అజంతాశైలి చిత్రణకొక మచ్చుతునక 'శ్రీరామ వనవాసం' తాత్త్విక సౌందర్యంతో అలరారగా, 'కార్తీక పౌర్ణమి' భారతీయ ఆధ్యాత్మిక వైశిష్ట్యాన్ని చాటుతుంది. 'పుష్పాలంకరణ' చిత్రం ప్రత్యేకమైనది. ఎందుకంటే, తన భార్య శ్రీమతి సత్యవాణి గారికి జరిగిన సీమంతాన్ని కనులారా తిలకించి, పరవసించి, ఆ పిదప రచించిన మూర్తిమత్వచిత్రం అది. దానిలో స్త్రీల రూపరేఖావిలాసాలు, వారి వస్త్రధారణవిధానం, వారు కూర్చునే విధానం, కూర్చొని చెప్పుకొనే ముచ్చట్లు మన మనసులకు హత్తుకొని, ఆ చిత్రంలో పేరంటాళ్లపై చల్లే పన్నీరు జల్లులు మన హృదయాలలోనే చిలకరింపబడతాయి తీరిగ్గా కూర్చొనివారు ముచ్చటించుకొనే ముచ్చట్లు మన చెవుల్లో లీలగా వినిపిస్తాయి.

రామారావుగారు పొందిన గౌరవాలు, పురస్కారాలు - 1920లో బొంబాయి నగరంలో జరిగిన చిత్రకళా ప్రదర్శనలో అనేక బహుమతులను పొందారు ఆ సంవత్సరంలోనే గుజరాత్ రాష్ట్రంలో పర్యటిస్తూ అహ్మదాబాద్‌లో తాను రచించిన చిత్రాలను ప్రదర్శించి గొప్ప మెప్పు పొందడమే కాకుండ, కొన్నివేల రూపాయల విలువగల చిత్రాలను అమ్మారు 1921లో కలకత్తాలో జరిగిన చిత్రకళా ప్రదర్శనలో కొన్ని చిత్రాలను ప్రదర్శించగా, 'ఋష్యశృంగ బంధనం' అనే చిత్రానికి గవర్నర్ జనరల్ బహుమతిని పొందారు 'గోదావరి లోయ' అనే చిత్రాన్ని చూసి ముగ్ధుడై అప్పటి వైస్రాయ్ రీడింగ్ ప్రభువు అప్పటికప్పుడే మూల్యం చెల్లించి దాన్ని తన స్వాంతం చేసుకొన్నాడు ప్రస్తుతం ఆ చిత్రం లండన్ మ్యూజియంలో భారతీయ

వారసత్వంగా భాసిల్లుతోంది. రామారావుగారి ప్రసిద్ధచిత్రం 'సిద్ధార్థ రాగోదయం' బొంబాయి ప్రదర్శనలో పలువురి మెప్పుపొంది, ఇంగ్లాండులోని వెంబ్లీనగర కళాకారులచే భళీ అనిపించుకొని, కెనడాదేశపు కళావిమర్శకుల కోరికపై అమెరికా ఖండంలోని టొరొంటో నగర ప్రదర్శనలో అంతర్జాతీయ బహుమతి పొందింది.

రామారావుగారు స్థాపించిన సంస్థను ఆయన ఆశయాల కనుగుణంగా వరదా వెంకటరత్నంగారు, తరువాత న్యాపతి సుబ్బారావు పంతులుగారు నిర్వహించారు. దామెర్లవారి స్మృత్యర్థం ఒక చిత్రకళామందిరాన్ని రాజమండ్రిలో నెలకొల్పాలని తీర్మానించగా, 1925లో వారి అన్న దామెర్ల వెంకటరావుగారి యింటిలోనే చిత్రకళామందిరాన్నీ, చిత్రకళాభ్యాసన పాఠశాలను ప్రారంభించడం జరిగింది ఆనాడా చిత్రకళామందిరాన్ని దర్శించిన మహాత్మాగాంధి ఎంతో పులకించిపోయారు.

18-7-1925న దేశభక్త కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు మొదదలగువారు సభ్యులుగా, విస్సా అప్పారావు కార్యదర్శీ, కోశాధికారిగా, వరదా వెంకటరత్నం ఆచార్యునిగా ఎన్నికైన ఆ స్మారక సంస్థ 'దామెర్ల రామారావు మెమోరియల్ ఆర్ట్‌గ్యాలరీ అండ్ స్కూల్' పేర రిజిస్ట్రేషనైంది. 1957లో ఈ సంస్థకు నూతన భవనం నిర్మించబడింది వరదా వెంకటరత్నంగారి తర్వాత ఆయన ప్రియశిష్యులు మాదేటి రాజాజీ ఆచార్యులుగా ఉండగా, ఆర్ట్‌గాలరీ యింకా ఉన్నతినీ, అభివృద్ధినీ సాధించగలదనే ఆశతో 1970లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ. సాంకేతిక విద్యాశాఖవారికి అప్పగించారు. అయితే పరిస్థితి వేరుగా ఉంది.

రాజమండ్రి గోదావరి రైల్వేస్టేషన్ దగ్గరలోనున్న ఈ చిత్రకళాకేంద్రం ప్రస్తుతం ఎంతో దయనీయ స్థితిలో ఉంది. ప్రముఖమైన కళావారసత్వం మరుగున పడిపోతూ ఉంది గ్యాలరీ భవనం మరమ్మత్తులకు నోచుకోక పాడుపడిపోతుంది లోపలికి వెళ్ళి చూస్తే దాదాపు 200 వర్ణచిత్రాలు, స్కెచ్‌పుస్తకాలు, లాంగ్‌షీట్ డ్రాయింగులు జీవం కోల్పోయి శిథిలావస్థలో మనకు కనిపిస్తాయి. ఇదే భవనంలో, ఈ మాదిరిగానే ఆ చిత్రరాజాలను ఉంచినట్లైతే, నిస్సంశయంగా కొంతకాలానికి దామెర్ల సృష్టి, వారసత్వం నశించిపోతాయనడంలో అతిశయోక్తి లేదు. ఆ చిత్రాలను భద్రపరచే విధానాలను సత్వరమే చేపట్టటడం అనివార్యం, అత్యవసరం, కనీస బాధ్యత కూడా! ఈ నేపథ్యంలో, రామారావుగారు జన్మించి వంద సంవత్సరాలు పూర్తిగా నిండిన ఈ తరుణంలో, ఆంధ్రులమైన మనం వారికీయగల ఘనమైన నివాళి ఏముంటుంది? ఆ వారసత్వాన్ని రాబోయే తరాలకు భద్రంగా అందించడమే!

# భారతీయ తత్వశాస్త్రం - క్రైస్తవుల అనుదానం

- శివలింగం

1994 మార్చి 1-3 తేదీలలో మూడు రోజులపాటు సత్యనిలయం మద్రాసులో భారతీయ తత్వశాస్త్రం - క్రైస్తవుల అనుదానం (Christian Contribution To Indian Philosophy) అనే విషయం మీద ఒక జాతీయ సమావేశాన్ని భారతీయ తత్వశాస్త్ర పరిశోధన మండలి, సత్యనిలయం పరిశోధనా సంస్థ వారు కలిసి ఉభయ సౌరధ్యంలో ఏర్పాటు చేశారు. భారతీయ తత్వశాస్త్రం హిందువులే కాకుండా హిందువులు కాని వారు కూడా అధ్యయనం చేసి విస్తృత పరిచారు. అందులో భాగంగా క్రైస్తవ పండితులు 14మంది భారతీయ తత్వశాస్త్రం మీద 14 వ్యాసాలు సమర్పించారు. చర్చల నిమిత్తం 14మంది హిందూ పండితుల్నికూడా ఆహ్వానించారు వ్యాసాల మీద చర్చలు ఆసక్తికరంగా జరిగాయి.

కె.సచ్చిదానందమూర్తి, చటోపాధ్యాయ, భువనచందేల్, బాలసుబ్రహ్మణ్యం, హెర్రింగ్.టి ఎన్ గణపతి, ఎస్.గోపాలన్, కందస్వామి, కృష్ణన్ రాజా, కె.యల్ మాధవన్, ఎస్. పెనేరుసెల్వం, ప్రేమానందకుమార్, ఎ.రామమూర్తి, సి రామయ్య, శంకరనారాయణన్ శ్రీనివాసరావు వంటి ప్రముఖ తత్వవేత్తలు పాల్గొన్నారు ప్రపంచవిఖ్యాత తత్త్వవేత్త సచ్చిదానందమూర్తిగారు ప్రారంభోపన్యాసం చేశారు భారతీయ తత్వశాస్త్రంలో ప్రధాన ధారలు రెండు. వేదాంత, శ్రమణ ధారలు. అద్వైత విశిష్టాద్వైత ద్వైత న్యాయవైశేషిక దర్శనాలు వేదాంతం బౌద్ధజైనాలు శ్రమణ సంప్రదాయం. వీటినే ఆస్తిక,నాస్తిక ధోరణులనీ అంటారు. వేదప్రమాణాన్ని అంగీకరించేవి ఆస్తికాలు. వేదప్రమాణాన్ని అంగీకరించనివి నాస్తికాలు. నాస్తికుడంటే భగవంతుణ్ణి అంగీకరించని వాడనే అర్థంకాదు. బౌద్ధం నిర్వాణాన్ని అంగీకరిస్తుందనే విషయం తెలిసిందేగదా! అనాత్మవాదం అనడం వల్ల అపార్థం చేసుకున్నారు పార్శీలు, మహమ్మదీయులు, క్రిష్టియనులు, భారతదేశం వచ్చి తాత్విక ధోరణుల్లో సంస్కృతిలో మార్పుతెచ్చారు ఈవిధమైన చర్చ జరగడం ఇదేప్రథమం క్రైస్తవ హిందూ పండితుల మధ్య సదవగాహనకు తోడ్పడుతుంది. ఒకరి భావాలతో మరొకరు ఏకీభవించకపోయినా భిన్నాభిప్రాయాలను గౌరవించడం, 'నాదే గొప్పద'ని అహంకరించి హూంకరించడం లేకుండా చల్లగా ప్రశాంతంగా జరగడం వలన మానవ మస్తిష్కంలో వున్న అడ్డుగోడలు కూలగొట్టటానికి దోహదపడతాయి ఇలాంటి సంవాదాలు

## పండితులు

భారతదేశానికి 1498లో వాస్కోడిగామా వచ్చాక ముస్లిములలో, క్రైస్తవులలో పండితుల, తాత్వికుల ఆలోచనాధారను మూర్తిగారు వివరించారు భారతీయతత్వశాస్త్రం ప్రధమంలో హిందూ తరవాత జైన, బౌద్ధం క్రీ.శ 1000నుండి క్రైస్తవ మతం, జొరాష్ట్రియనిజం, ఇస్లాం ప్రభావంతో సిక్కుమతం భారతదేశంలో స్థిరపడ్డాయి. దేశానికి వచ్చి మిషరీ ప్రముఖుడు రాబర్టు డి.నొబిలి (1577-1656) సంస్కృత భాషను వ్రాయడం, మాట్లాడటం కూడా నేర్చుకున్నాడు. పీరెజొహాన్స్ (1882-1955) భారతీయ మేధావుల్ని ఆకర్షించే నిమిత్తం

★ **శివలింగం దర్శన శాస్త్రాన్ని** ఔపోశన పట్టారు కృష్ణా జిల్లా చల్లపల్లిలో ఉంటున్నారు

వేదాంతాన్ని స్వీకరించాడు. జూల్ మోంచాని పేరు మార్చుకుని స్వామి పరమ అరుబి ఆనందం (1895-1957) హెన్రీ లెసాక్స్ స్వామి అబిక్తానంద (1910-73) గాను బిడేగ్రిఫిత్స్ స్వామిదయానంద (1906-93)గాను భారతీయులుగా మారిపోయారు భారతీయ ఆశ్రమధర్మాన్ని స్వీకరించి క్రైస్తవానికి హిందూమతానికి వారధిగా నిలిచారు. భారతదేశం వచ్చిన పాశ్చాత్యులు విలియంమిల్లర్ (1838-1923) ఎ.జిహాగ్ (1890-1954) బెర్నార్డ్‌లూకాస్ (1860-1920), పర్కూబర్ (1861-1929) సి.యఫ్. ఆండ్రూస్ (1871-1940) వీరంతా భారత దేశంలోని మతాలు భగవంతుడు సృష్టించినవని క్రైస్తవం సర్వమత సమ్మేళనమని చెప్పారు.

19వ శతాబ్దంలో భారతీయ పునర్వికాసోద్యమంలో హిందూ క్రైస్తవ మతాల సమ్మేళన కనిపిస్తుంది. ప్రథమ ఆధునిక భారతీయుడు రాజారామమోహనరాయ్ (1772 - 1833) బ్రహ్మ సమాజస్థాపకుడు.

| | |
|---|---|
| కేశవచంద్ర సేన్ | 1838 - 84 |
| ప్రతాప సి. మజుందార్ | 1840 - 1905 |
| స్వామిదయానంద | 1824 - 1883 |
| మహదేవ గోవిందరనెడె - | 1842 - 1901 |
| రామకృష్ణ పరమహంస | 1834 - 1886 |
| వివేకానందుడు | 1863 - 1902 |
| రవీంద్రుడు | 1861 - 1941 |
| మహాత్మాగాంధీ | 1869 - 1948 |
| ్పల్లి రాధాక | 1888 - 1975 |

మహానుభావులైన వీరందరూ పాశ్చాత్య సంస్కృతిని క్రైస్తవ విశ్వాసాన్ని భారతీయాత్మతో విలీనం చేశారు. కొద్దిగానో గొప్పగానో అందరూ క్రైస్తవ మత ఔన్నత్యాన్ని, ఆత్మను దర్శించిన వారే.

రాయ్, గాంధీలు Sermon on the Mount వల్ల ప్రభావితులయ్యారు. క్రీస్తు దివ్యమానవత కేశవ సేన్‌ను ఆకర్షిస్తే, రామకృష్ణ వివేకానందులు క్రీస్తులో జీవన్ముక్తుడిని దర్శించారు.

బ్రహ్మబాంధవ ఉపాధ్యాయ (1861-1907), కె.యం. బెనర్జీ (1813-85) లాల్‌విహారిడే (1824-1894) మున్నగువారు జీసస్‌పై పూర్తి విశ్వాసంతో అంకిత భావంతో కృషిచేశారు. బ్రహ్మ బాంధవుడు ఉపనిషత్తులలోని సత్-చిత్-ఆనంద త్రయాన్ని క్రైస్తవ ఫాదర్, సన్,

హోలిస్పిరిట్ - త్రయంతో కలిపాడు. మహారాష్ట్రలో నెహమియాగోరె (1825-1895) పండితరమాబాయి (1858-1922), నారాయణవామనతిలక్ (1862-1919) మణిలాల్‌పరేఖ్ (1885-1967)లు క్రైస్తవ సందేశంతో ప్రభావితులైనారు. ఆధునికుల్లో ప్రముఖ పండితులు రైముండో ఫణిక్కర్, సెబాస్టియన్ కప్పన్‌శామ్యూల్‌రాయన్, జార్జి సొరెస్ ప్రభు, అవలొర్పవదాస్, మైకేల్ అమలదాసు, జోసఫ్ నూనెర్, సాచ్, సారాగ్రాంట్ వందన మొదలయిన వారు పాశ్చాత్య క్రైస్తవులకు గ్రీకు శాస్త్రం పునాది అయినట్టుగానే భారతీయ క్రైస్తవులకు భారతీయ తత్వశాస్త్రం పునాది అన్నారు రాధాకృష్ణన్ Christian Contribution to Indian Philosophy గ్రంథం క్రిష్టియన్ లిటరేచర్ సొసైటీ వారు ప్రచురించారు. ధ్వని సిద్ధాంతం నుండి శంకరుని అద్వైతం, శైవసిద్ధాంతాలు, నవ్యన్యాయసిద్ధాంతం వరకు వ్యాసాలు సమర్పించినవి వున్నాయి. 1993లో The Role of Philosopher Today గ్రంథాన్ని ఇదే విధంగా ఒక సమావేశము ఏర్పాటు చేసి తీసుకువచ్చారు.

శంకరుని మీద డిస్మెట్ ఆలోచనాత్మకమైన వ్యాసం రాశారు. శంకరుడు నిర్గుణ పరబ్రహ్మ తత్వాన్ని ప్రతిపాదించాడు. అటువంటి ఉన్నతస్థితి నుంచి పామరస్థాయికి అధమస్థాయికి చెందిన భక్తి మార్గాన్ని ప్రబోధిస్తాడా! శంకరుని రచనలుగా 433గా ప్రచారం. ఇవన్నీ శంకరుని రచనలుగా ఆధునిక పండితులు అంగీకరించడం లేదు. సౌందర్యలహరి శంకరుడే రాస్తే తాత్వికుడు కానేకాదు శంకరుడనాలి ఆలోచనాశక్తి నశించాక పుట్టినది భక్తి మార్గం. శంకరుని రచనలుగా భావిస్తున్నవి ఇవి.

1. బృహదారణ్యక ఛాందోగ్య, ఐతరేయ తైత్తరీయ-ఈశకేన, కఠ, ప్రశ్న ముండక ఉపనిషత్తులు - తొమ్మిది మీద రాసిన భాష్యాలు.
2. భగవద్గీతాభాష్యం
3. బ్రహ్మసూత్ర భాష్యం
4. ఉపదేశ సాహస్రి

మాండూక్యోపనిషత్తు మీదరాసిన భాష్యం శంకరుడురాశాడనడంలో భిన్నాభిప్రాయంవుంది. 'శంకర దిగ్విజయం' గ్రంథంలో పేర్కొన్న అంశాలు కల్పితాలు. శంకరుడు ఎనిమిదవ శతాబ్ది ప్రథమార్ధంలో జీవించాడు. తరవాత అయిదు శతాబ్దాలకు శంకర దిగ్విజయం గ్రంథం వచ్చింది. ఆ గ్రంథం శంకరుణ్ణి గురువుగా ప్రతిష్టించుకుని రాయడంవలన అతిశయోక్తులతో నిండి పోయింది. శంకరునిగురించి చివరకు draws together god, world and man in a single conception (non-dualistic) Unity అన్నారు

తాత్వికులకు మతాధిపతులకు మధ్య గట్టిగా కట్టిన సరిహద్దు గోడలేవీలేవు వైయక్తాను భూతికి భారతీయ తత్వం ప్రాధాన్యతనిచ్చింది. పాశ్చాత్యతత్వం వస్తుతత్వానికిచ్చింది. గతకాలంలో

మతమే తత్వశాస్త్రం. ఆధునిక తత్వశాస్త్రం మతాన్ని వొదిలేసింది దేవుళ్లు దేవతలు మతానికి సంబంధించినవి Theological Conception God కాదు Philosophical Conception of Absolute. అంతిమ సత్తాను అర్థం చేసుకోడం కన్నా మానవసత్తాను అర్థం చేసుకోడం మరీ కష్టం. ఒక దివ్య భావన మానవచైతన్యం నుంచే ఉద్భవిస్తుంది.

మేధావివర్గం అభిమానించే నవ్య న్యాయదర్శనం గురించి డా. జాన్ వత్తంకి రాశారు. న్యాయదర్శనాన్ని అద్వైతమార్గం పట్టించినవాడు ఉదయనాచార్యుడు. నిజమైన భారతీయ తత్వాన్ని సృష్టించడానికి దోహదపడింది న్యాయదర్శన మేనంటాడు. ఆలోచనా రీతి, నైరూప్య తార్కిక కౌశల్యం లోతైన విశ్లేషణ మానవుడిని సర్వతోముఖంగా పరిశీలించి అవగాహన చేసుకోడానికి ఉపకరిస్తాయి నవ్యన్యాయ దర్శనాన్ని అధ్యయనం చేసి అర్థం చేసుకుంటే అద్వైత, విశిష్టా ద్వైత, ద్వైత, వ్యాకరణ, అలంకారశాస్త్రాలన్నిటిని కరతలామలకం చేసుకోవచ్చనడంలో సందేహంలేదు. అక్షపాదుని న్యాయదర్శనం తరవాత న్యాయచతుర్గ్రంధికా అనే నాలుగు సుప్రసిద్ధగ్రంధాలు.

1. న్యాయభాష్యం - వాత్సాయన పక్షిలస్వామి.
2. న్యాయభాష్యవార్తిక - భారద్వాజ ఉద్యోతకారుడు.
3 న్యాయభాష్య వార్తిక తాత్పర్యటీక - వాచస్పతి మిశ్రుడు
4. న్యాయభాష్య వార్తిక తాత్పర్యపరిశుద్ధి - ఉదయనాచార్యుడు.

ఈనాలుగూ, న్యాయసూత్రాలు కలిపి పంచ ప్రస్థానన్యాయతర్కమంటారు ఈ గ్రంథాలు భారతీయ సాంస్కృతిక వారసత్వానికి, పునరుజ్జీవనానికి నూతన సమాజనిర్మాణానికి తోడ్పడతాయని,కావున న్యాయశాస్త్ర చరిత్ర సమగ్రంగా రచించాలని సూచించారు. పాణిని వ్యాకరణం ఒక గొప్ప స్మృతి చిహ్నంగా నిలిచి వున్నట్టుగానే న్యాయదర్శనంకూడా వుంటుందని విశ్వసించారు.

'శ్రుతుల సంప్రదాయం - సంప్రదాయశ్రుతులు' అనే బృహద్వ్యాసం ఫ్రాన్సిస్ రాశారు. ఈ నాలుగు సూత్రాలను ప్రతిపాదించి వివరించడం జరిగింది.

వ్యాఖ్యానం లేకుండా శ్రుతుల్ని అర్థం చేసుకోలేరు.
సంప్రదాయం లేకుండా వ్యాఖ్యానం వుండదు.
సంప్రదాయాన్ని తెలిపేది శ్రుతి.
ఏ శ్రుతి అయినా ఒకే సంప్రదాయపు గుత్త ఆస్తికాదు.

శ్రుతి, సంప్రదాయం విడదీయరానివి. పురోగమిస్తూ వుంటాయి. రెంటిమధ్య హద్దులు వుండవు. దయానంద ఫ్రాన్సిస్ తమిళంలోను ఆంగ్లంలోను రచనలు చేసినవారు. తమిళభక్తి

కవులనుంచి క్రైస్తవ కవులు బైబిలు భాష అభివ్యక్తీకరణకు చాలకపోవడంవలన అరువు తెచ్చుకున్నారు. Dialogue గురించి ఇగ్నేషియస్ రాస్తూ అన్ని మతధర్మాలు సంవాదాల ద్వారానే జీవిస్తాయన్నారు. మానవుడు, దేవుడు కలిసే వుంటారని క్రిష్టియానిటి నొక్కి చెపుతోంది బౌద్ధం ఉపనిషత్తులు పాశ్చాత్య సాహిత్యం ఆలోచన సజీవంగా వుంటాయి సంవాదాలద్వారా. తరాన్ని నడిపే శక్తి ప్రేమ కాంతి అయితే సదా నిలిచివుంటుంది. జస్వత్ రాజ్ శైవసిద్ధాంత అధ్యయనం చేశారు మిషనరీలను తమిళ శైవమతం, శైవసిద్ధాంతం బాగా ఆకర్షించాయి. శైవసిద్ధాంతం లౌకిక తాత్విక సిద్ధాంతం. శైవంలోను సెయింట్‌పాల్‌లోను కరుణను గురించి రాశారు. శ్రీనివాసరావు భారతీయ క్రైస్తవ మతంలో మూడు ముక్తి మార్గాలను గురించి చెప్పారు జ్ఞానభక్తి కర్మమార్గాలు . హిందూమతంలోనివి క్రైస్తవమతంలో ఫాదర్, సన్, హోలీస్పిరిట్. డేవిడ్ స్కాట్ భారతీయ కళాసాహిత్యంలో తాత్విక పరిశోధనచేశారు. ప్రథమ సాహిత్య గ్రంథం ఋగ్వేదం, ఇతిహాసాలు భారతరామాయణాలను పరిశీలించారు. తాత్విక పరిశోధన మార్గ సంప్రదాయాన్ని అనుసరించిందే గాని దేశిసంప్రదాయాన్ని స్వీకరించలేదన్నారు. కథా రచన చచ్చిపోతోందని ఆవేదన చెందాడు. క్రైస్తవ అనుభూతిని అద్వైతావగాహన నుంచి అన్వేషించాడు. నిజానికి రెండూ ఒకటికాదు. కాని సాధించవలసింది.

మొదటి వ్యాసం ఆనంద అమలాదాస్ ధ్వనిసిద్ధాతం మీద రాశారు. కవిత్వంలో సత్యావిష్కరణ గురించి అన్వేషణ చేశారు భారతీయ ధ్వని సిద్ధాంతాన్ని పాశ్చాత్యుల సాహిత్య సిద్ధాంతాలతో పోల్చిచెప్పాడు. చివరకు హెర్రింగ్ Summing up అనే సమీక్షాత్మక వ్యాసం రాశాడు.

ఇటువంటి గ్రంథాలు సంప్రదాయ ధోరణుల్ని సరిగా అర్థంచేసుకోడానికి ఉపయోగపడతాయి. క్రైస్తవులు భారతీయ సాహిత్య, కళా, తాత్విక ధోరణుల గురించి ఎలా రాస్తున్నారు, ఏవిధంగా అర్థం చేసుకుంటున్నారో మిగిలినవారికి తెలుస్తుంది లోపాలుంటే చర్చల ద్వారా సరిదిద్దుకోడానికి అవకాశం కలుగుతుంది. ఇటువంటి Symposium లు ఇంకా జరగాలని ఆశిద్దాం

**ఆధారాలు :**

1. Christian Contribution to Indian philosophy - ED.
   By. Ananda Amaladass. Christian literature Society, Madras - 1995.
2. Christian contribution to Indian philosophy -
   Report - Premanandakumar. JICPR Vol. XI -3 1994.

## సవరణ

౨7 మే సంచికలో ''ఝమి''కి బదులు ''ఝూమీ'' అని పడింది.

పొరపాటుకు చింతిస్తున్నాము.

# మత విశ్వాసం మందుగా పనిచేస్తుందా?

- అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి

మంత్రాలకు చింతకాయలు రాలతాయా? నిన్న మొన్నటి వరకు ఏ డాక్టరైనా, శాస్త్రజ్ఞుడైనా 'రాలవు' అని ఖండితంగా చెప్పేవాడు. ఇప్పుడు అంత నిబ్బరంగా గుండె మీద చేయివేసుకొని చెప్పలేక పోతున్నాడు ఎందుకంటే, మతవిశ్వాసం, దేవుని మీద నమ్మకం, ప్రార్థన, ధ్యానాలు మందుగా పని చేసి రోగాలను నయం చేస్తున్నాయని చాల మంది వైద్యులు నమ్ముతున్నారు. ప్రయోగాలు చేస్తున్నారు ఆ ప్రయోగాలలో వారికి ఏదో కొంత సాక్ష్యం దొరుకుతున్నదంటున్నారు. ఇరవై సంవత్సరాల క్రితం అయితే, ఆత్మ గౌరవం ఉన్న ఏ డాక్టరు ఇటువంటి ప్రయోగాలకు పూనుకోవడానికి సిగ్గుపడేవాడు ఎవరో ఎవరికోసమో ప్రార్థన చేస్తే ఆ రోగికి రోగం కుదురుతుందంటే లోకం నవ్విపోతుందని భావించేవాడు. ఫ్రాయిడ్ మత విశ్వాసాన్ని ''శైశవ నిస్సహాయత'' (infantile helplessness) గా, ప్రాధమిక స్వానురాగం (Primary narcissism)గా కొట్టి పారవేశాడు. మార్క్స్ మతాన్ని నల్లమందుగా అభివర్ణించాడు. కాని ఈనాడు కొంత మంది డాక్టర్లైనా, రక్తకణాల గణన, ఇ.సి.జిలు స్కానింగులు, బిళ్ళలు, మాత్రల కంటె ప్రార్థనలో, విశ్వాసంలో ఏదో కొంత రోగాలను నయం చేసే గుణం ఉందని భావిస్తున్నారు. ఇరవయ్యో శతాబ్దం ముగింపు కొచ్చే కొలది వైద్యశాస్త్రం సాధించిన అద్భుత విజయాల మీద అత్యంత సాంకేతిక వైద్య విధానాల మీద- భ్రమలు తొలిగి పోతున్నాయి. తరుణ అంటు వ్యాధులను, చెడిపోయిన కిడ్నీలను, గుండెలను ఆధునిక సాంకేతిక వైద్యం నయం చేయకలుగుతోంది. కాని దీర్ఘవ్యాధులైన అధిక రక్తపోటుకు, నడుమునొప్పులకు, కీళ్ళవాత నొప్పులకు, అవసాదాని (కుంగిపోవడం)కి క్యాన్సర్‌కి, ఎయిడ్స్‌కి అదేమి చేయగలుగుతోంది? ఈ దీర్ఘకాలిక రోగాలన్నింటిలో ఆధునిక జీవన శైలి, ఒత్తిడిల పాత్ర ఉంది. ఇటువంటి దీర్ఘకాలిక రోగాలకు మందులు, శస్త్ర చికిత్సలు ఏమీ పని చేయడం లేదు. విచిత్రం ఏమిటంటే ఈ రోజు డాక్టర్ల దగ్గరకు పరుగులు తీసే రోగులలో నూటికి 60నుంచి90వరకు ఇటు వంటి రోగులే. ఆధునిక సాంకేతిక వైద్యం తమకు ఏమీ సహాయ పడడం లేదనే భావనతో వీరంతా విచారిస్తున్నారు. అందుకని వీరు తమ స్వాస్థ్యాన్ని, సాంత్వనాన్ని వేరే చోట దేవాలయాల్లో, ప్రార్థనా మందిరాలలో, ఆధ్యాత్మిక గురువుల దగ్గర, నూతన యుగవైద్యులైన దీపక్ చోప్రా, ఆండ్రూ వెయిల్, లారీ డోస్సేలాంటి మార్మిక గురువుల దగ్గర, వీరు రాసిన పుస్తకాలలో, తయారుచేసిన టేపులలో వెతుక్కొంటున్నారు

కొంతమంది శాస్త్రజ్ఞులైతే అసలు మత విశ్వాసం మందుగా పని చేస్తుందా? ప్రార్థనలకు రోగాలు నయం అవుతాయా? ఆధాత్మికతకు రోగం నయం కావడానికి ఏమైన సంబంధం ఉందా? ప్రార్థన-రోగం నయం కావడం యాదృచ్ఛికమేనా? వాటి రెండింటి మధ్య కార్యకారణ సంబంధం ఉందా? ప్రార్థనలు నిజంగా రోగాలను నయం చేస్తుంటే, ప్రార్థనకు దేవుడు బందీ అయి, దివినుంచి భువికి దిగివచ్చి, రోగాలు కుదురుస్తున్నాడా? అనే ప్రశ్నలను వేసుకొని, సమాధానాల కోసం అధ్యయనాలు మొదలు పెట్టారు.

వైద్యసాహిత్యంలో దీనికి సంబంధించిన సమాచారం కావలసినంత లభిస్తోంది డా లెవిన్, డా డేవిడ్ లార్సన్‌లు రెండు వందల అధ్యయనాలను పరిశీలించి, మంచి ఆరోగ్యానికి మతం మందుగా పని చేస్తుందని అవి సాక్ష్యం పలుకుతున్నాయని చెప్పారు అలాగే 232 మంది గుండెజబ్బు రోగుల్లో మత విశ్వాసం ఉన్నవారు లేనివారికంటె ఎక్కువ మంది- దాదాపు మూడు రెట్లు - కోలుకొన్నారు అధిక రక్తపు పోటుపై జరిగిన 30 సంవత్సరాల ఒక పరిశోధనలో చర్చికి వెళ్ళేవారికంటె వెళ్ళని వారిలో పోటు ఎక్కువగా ఉందని లార్సన్ తేల్చాడు. (పొగత్రాగడం, మద్యం సేవించడం లాంటి కారకాలను లెక్కలోకి తీసుకొన్నాడు) చర్చికి క్రమం తప్పక వెళ్ళే వారిలో వెళ్ళని వారిలో కంటె సగంమంది మాత్రమే గుండె రక్తనాళాల జబ్బుతో చనిపోయే ప్రమాదాన్ని ఎదుర్కొంటున్నారు 1996లో వార్ధక్యపు జాతీయసంస్థ ఉత్తర కారోలినాలో 4000 మందిపై జరిపిన ఒక పరిశోధన మత ప్రార్థనలకు హాజరైన వారు, హాజరుకాని వారికంటె ఎక్కువమంది శారీరకంగా ఆరోగ్యవంతంగా ఉన్నారనీ, అవసాదానికి (depression) గురైన వారి సంఖ్య గూడ చాల తక్కువేనని తేల్చింది. ఇంకా అనేక అధ్యయనాలు మతవిశ్వాసులకు వ్యాకులతా సంబంధరోగాలు, అవసాదాలు చాల తక్కువగా వస్తాయని చెప్పాయి.

ఇలాంటి ఫలితాలు రావడానికి మత విశ్వాసమే కారణమా? ఈ ఫలితాలనే మనం మరో కోణం నుంచి వివరించ లేమా? మామూలుగా మతాలు త్రాగడం తప్పని, మత్తు మందుల సేవనం కూడదని, పొగత్రాగరాదని- ఇంకా ఇలాంటి వ్యభిచారాలను నిషేధిస్తాయి నిర్దిష్టవేళల్లో స్నానాలు, భోజనాదులను ఆచరించమంటాయి అంతే కాక గుడులు, మందిరాలకు వెళ్ళి కొంత సేపు ధ్యానంలో ప్రశాంతంగా ఉండమని మతం నిర్దేశిస్తుంది. ఇవన్నీ మంచి అలవాట్లే గదా. ఈ మంచి అలవాట్లు మామూలుగా ఆరోగ్యానికి దోహదం చేస్తాయి గదా. మత విశ్వాసం లేకుండా, ఈ మంచి అలవాట్లను పాటించే వారి మాట ఏమిటి? వీరి విషయంలో మత విశ్వాసం కారణంగా రోగాలు కుదిరాయని చెప్పగలమా?

మంచి అలవాట్లు మంచి ఆరోగ్యానికి దోహదం చేస్తాయనే విషయాన్ని దృష్టిలో ఉంచుకొని, అంటే ఈ అంశాన్ని గూడ పరిగణనలోకి తీసుకొని లార్సన్ అనే శాస్త్రవేత్త అధ్యయనాలు చేశాడు పొగత్రాగేవారిలో మతవిశ్వాసం ఉన్నవారిని, లేనివారిని రెండు సమూహాలుగా విభజించి ప్రయోగాలు చేశాడు ఆరోగ్యం కుదుట పడడంలో- అధిక రక్తపోటును సరిదిద్దడంలో- విశ్వాసుల్లో అవిశ్వాసులలో కంటె ఏడురెట్లు గుణం కనిపించిందనే నిర్ణయానికి వచ్చాడు.

మరి ఈ అధ్యయనాలను బట్టి మనం శరీర ధర్మాల మీద ఆరోగ్యం మీద మతానికి ప్రత్యక్ష ప్రభావం ఉందని భావించవచ్చా? హార్వర్డ్ విశ్వవిద్యాలయానికి చెందిన హెర్బర్ట్ బెన్సన్ భావించ వచ్చునే అంటాడు. ఈయన The Relaxation అనే గ్రంథాన్ని 1975లో రచించాడు. అందులో, ధ్యానాన్ని ఆచరించడం ద్వారా ఒత్తిడివల్ల జనించిన జబ్బులను తేలికగా ఎదుర్కోవచ్చని రాశాడు. ఇక్కడ ధ్యానం అంటే, ఒక ప్రతిమపై గాని, శబ్దంపై కాని మనస్సును లగ్నం చేయడం అలా మనస్సును లగ్నం చేసినప్పుడు శరీరంలో అనేక మార్పులు జరుగుతాయి ఈ మార్పులన్నీ ఫైట్

ఆర్ స్టేట్ అంటే సమరం లేదా పలాయనం అనే ప్రతిస్పందనకు వ్యతిరేకంగా ఉంటాయి. ధ్యానంలో, గుండెరేటు, ఉచ్ఛ్వాస నిశ్వాస, మస్తిష్క తరంగాల వేగం తగ్గుతుంది. కండరాలు సడలుతాయి. ఒత్తిడిని కలిగించే ఎపైన్‌ఫ్రైన్ ఇంకా ఇతర ఒత్తిడి సంబంధిత హార్మోనులు స్రవించడం తగ్గుతుంది. ఈ ధ్యాన ప్రతి స్పందనను క్రమం తప్పక చేసిన నిద్రలేమి వారికి నిద్ర బాగా పట్టింది. బాధోపశమన ఔషధాలను వాడాల్సిన అవసరం లేకుండా పోయింది.

బెన్సన్ ఇంతటితో ఆగితే బాగానే ఉండేది. ధ్యానం వలన ప్రశాంతత, శరీరం, మనస్సులు విశ్రాంతి పొందడం అందరికీ ఎరుకలోని విషయమే. ధ్యానం అంటే మనస్సును ఏదో వస్తువు మీదో, శబ్దం మీదో లగ్నం చేయడమే కాబట్టి, ఇందులో మత సంబంధమైన దేది లేదు. కాని అతడు ఇంకొంత ముందుకుపోయి ధ్యానాన్ని ఆధ్మాత్మికతా రంగంలో అంతర్భాగం చేశాడు. వాస్తవానికి మానవ ప్రవృత్తి మత విశ్వాసానుగుణంగా ఉంది అన్నాడు. ఈ నిర్ణయానికి రావడానికి అతడు కొంత మంది రోగుల అనుభవాలపై ఆధారపడ్డాడు. ఆరోగులు తాము ధ్యానం చేస్తున్నప్పుడు దైవసాన్నిధ్యాన్ని అనుభవించామని చెప్పారు. బెన్సన్ ఐదు ఏళ్ళ పాటు రోగులపై పరిశోధనలు గావించి, తాము ధ్యానంలో ఉన్నప్పుడు ఏదో ఉన్నతశక్తి తమకు తోడై ఉందన్న భావంతో ఉన్న రోగులకు దీర్ఘవ్యాధులు త్వరత్వరగా తగ్గిపోయాయని చెప్పాడు.

''పారమార్థిక శక్తిపై విశ్వాసాన్ని మానవస్వభావంలో ఒక అంశంగా మన జన్యువముూనా చేసింది. మానవ పరిణామం మనకు మన మర్త్యత్వాన్ని గుర్తించేట్టు ఒక అనన్యమైన శక్తిని ప్రసాదించింది. ఈ మర్త్యత్వ దురవస్థను ఎదుర్కొనడానికి మనుషులు దేవునితో బంధితులయ్యారు'' అన్నాడు బెన్సన్. ఇతడి దృష్టిలో మనం విశ్రాంతిలో ఉన్నప్పుడు విశ్రాంతి ప్రతిస్పందన పనిచేసే మార్గాలలోనే ( జీవ రసాయనిక పథాలలోనే) ప్రార్థన గూడ పనిచేస్తుంది. మరో విధంగా చెప్పాలంటే ప్రార్థన గూడ (విశ్రాంతిలో వలె) రక్తపోటును, గుండె రేటును, శ్వాసను నెమ్మది పరిచే స్ట్రెస్ హార్మోన్స్‌ను ప్రభావితం చేస్తుందంటాడు.

ఇటువంటి విషయాలపై ఇటీవలనే ప్రయోగాలు జరిపిన డేవిడ్ ఫెల్టన్, రోచెస్టర్ విశ్వవిద్యాలయ న్యూరోబయోలజీ చైర్మన్, శారీరక రోగ నిరోధక శక్తిపై స్ట్రెస్ హార్మోనుల ప్రభావం ఉందని తేల్చాడు. ''ధ్యానానికి సంబంధించింది ఏదైనా, హార్మోన్ ప్రక్రియను పరివర్తింపజేసే మానసిక స్థితిని నియంత్రించేదయితే, అది రోగ నిరోధక వ్యవస్థపై ప్రభావాన్ని చూపుతుంది'. అన్నాడు.

విశ్రాంతి ప్రతి స్పందన (relaxation response), మతానుభవం- ఈ రెండు మస్తిష్కంలోని ఒకే ప్రదేశానికి సంబంధించి ఉండడం యాదృచ్ఛికం కాదు. లింబిక్ వ్యవస్థలో అమిగ్డల (amygdala), హిపోకాంపస్ (Hippocampus), హైపోథాల్మస్ (Hypothalmus) ఉంటాయి. ఈ లింబిక్ వ్యవస్థ ఉన్నత జీవులైన కోతి, చింపాంజీ, మానవులలోనే ఉంటుంది. ఈ వ్యవస్థ ముఖ్యంగా ఉద్వేగాలకు, లైంగికానందానికి, గాఢానుభూతి స్మృతులకు, ఇంకా ఆధ్యాత్మికతకు కేంద్రంగా కనిపిస్తుంది. ? అమిగ్డల ముఖ్యంగా విశ్రాంతి ప్రతి స్పందనతో ముడివడి ఉంది. శస్త్ర చికిత్సా సమయంలో అమిగ్డలను గాని, హిపోకొంపస్‌ను గాని విద్యుత్ పరంగా కదిలించినట్లయితే,

ఆరోగులలో కొందరికి దేవతలు, దయ్యాలు కనిపించాయి దీర్ఘకాలం మందుల దురుపయోగంతో లింబిక్ వ్యవస్థను ప్రభావితం చేసినా, ఆ వ్యవస్థలో ఒక కణితి లేచినా, ఆరోగులు మత ఛాందసులుగా మారుతున్నారు. దీనిని బట్టి చూస్తుంటే మనకు ఏమనిపిస్తుంది? మతానుభవాలకు శారీరకాధారం ఉందా అనిపిస్తుంది. ఇది సత్యమే నంటాడు, కాలిఫోర్నియా మెడికల్ సెంటర్ న్యూరోసైంటిస్ట్ రాన్‌జోసెఫ్ (Rhawn Joseph).

అయితే చాలమంది పరిశోధకులు విశ్వాసానికి ప్రభావం ఉందని ఒప్పుకొంటూ, ఆ ప్రభావం మత విశ్వాస ప్రభావమే కానవసరం లేదు, ఏ విశ్వాసమైనా అలాగే పని చేస్తుంది, అని చెబుతున్నారు వైద్య విధానంలో ప్లేసిబో ప్రభావం (Placebo effect) గురించి అందరికీ తెలుసు హోమియో వైద్యులకు ఇది ఇంకా బాగా తెలుసు కొంత మంది డాక్టర్లు అసలు మందు ఒకటి రెండు మోతాదులు ఇచ్చి, మిగతా మోతాదులకు '' ఉత్తుత్తి మాత్రలు'', (మందు లేని మాత్ర (Placebo) ఇస్తారు. రోగి మాత్రం అన్నీ నిజంగా మందు ఉన్న మాత్రలే అని విశ్వసిస్తాడు. రోగి ఆ ఉపచారాన్ని నిజంగా నమ్మితే అది ఒట్టి పంచదార గుళిక అయినా పనిచేస్తుంది. రోగి కున్న ఆ నిజమైన విశ్వాసమే రోగాన్ని కుదురుస్తుంది ఒకసారి 1950లో వేవిళ్ళతో బాధితులైన స్త్రీలకు ఏదో అరుకు ఒకటి, ఇచ్చి, '' ఇది వేవిళ్ళకు కొత్త మందు'', అని చెప్పారు. ఆ స్త్రీలు ఆ మాటలను నమ్మారు పూర్తిగా విశ్వసించారు. రోగం నయమైంది. ''అసలు వైద్యశాస్త్ర చరిత్రలో అధికభాగం 'ప్లేసిబో' చరిత్రే'', అన్నాడు బెన్సన్ ఇలా అంటూనే అతడు, మతవిశ్వాసం ప్రభావం ఇంకా ఎక్కువ అని నమ్మాడు. దీనివలన 60% నుంచి 90% వరకు వైద్యసమస్యలు పరిష్కారమవుతున్నాయన్నాడు.

మరి మనం ఇప్పుడు కొన్ని ప్రశ్నలు వేయవచ్చు. మత విశ్వాసమూ విశ్వాసమే, ప్లేసిబో మీద విశ్వాసమూ విశ్వాసమే. రెండు విశ్వాసాలకు తేడా ఏమిటి? మత విశ్వాసం సాధారణంగా దేవునిపై విశ్వాసం అయి ఉంటుంది. అంటే మత విశ్వాసులలో రోగాలు, అవిశ్వాసులలో కంటె ఎక్కువగా, త్వరగానయమవుతున్నాయంటే, దానికి కారణం మత విశ్వాసుల పక్షాన దేవుడు వచ్చి నిలబడ్డాడని మనం అనుకోవాలా? వారిప్రార్ధనలను దేవుడు మన్నించాడనుకోవాలా? మన్నించాడనడానికి మన్నించ లేదనడానికి ఏ ఆధారం లేదు. అలాంటప్పుడు బుద్ధుడులా, ఆ విషయం నేనేమి చెప్పలేను అనాలి. అవునన్నా కాదన్నా ఆధారం చూపాలికదా వైద్యంలో మోసానికి వ్యతిరేకంగా పని చేసే జాతీయ సంస్థ అధ్యక్షుడు విలియమ్ జార్విస్ అనే ఆచార్యుడు ''జెల్లీని మేకుగా చేసి గోడలో దించే ప్రయత్నం లాంటిదే ఇదీను'' అన్నాడు. '' ఏది ఎందుకు పని చేస్తుందో తెలియకముందే అది పని చేస్తున్నట్లు మనం గమనిస్తాము'', అని లారీడోసే అన్నారు.

ఆమధ్య జరిపిన ఒక సర్వేలో 82% రోగులు ప్రార్ధన శక్తి మీద తమకు నమ్మకం ఉందన్నారు. 64% రోగులు డాక్టర్లు తమతో పాటు ప్రార్ధన చెయ్యాలనే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. మరి అలాంటి సందర్భాలలో డాక్టరు నాస్తికుడైనా, ఇలాంటి నమ్మకాలు లేక పోయినా రోగి కోసం ప్రార్థనలో పాల్గొనడం మంచి పని అంటున్నారు కొందరు. మరి నిజంగా డాక్టర్లు అలా పాల్గొంటే, శరీరం మీద మనస్సుకు అదుపు ఎక్కువగా ఉంటుందని, అసలు మందులతో పనేమిటి అనే

దృక్పధంలో రోగులు పడే ప్రమాదం ఉంది. అంతేకాదు, వైద్యం, మందులు ఖర్చుతో గూడిన పని, ప్రార్ధన ఖర్చు లేని పని అని అందరూ భావిస్తే డాక్టర్ల పని గోవింద మందుల కంపెనీలు మూత పడాల్సిందే.

ఇది ఇలా ఉండగా అమెరికాలో స్థిరపడిన భారతీయ వైద్యుడు దీపక్ చోప్రా, భారతీయ పారమార్థకతత్త్వాన్ని వైద్యంతో జోడించి, ఆత్మ, దేహం ఎలా ఎక్కడ పరస్పర చర్యజరుపుకొంటున్నాయో వివరిస్తున్నాడు 49 సంవత్సరాల వయస్సు ఉన్న ఈ డాక్టరు భారతీయ హిందూ మార్మికత(mysticism) ను ఔపోశన పట్టాడు. అసలు అతని నిజమైన ప్రజ్ఞ ఎక్కడ ఉన్నదంటే, అతని సంశ్లిష్ట దర్శనాన్ని అతడు కంప్యూటరు భాషలో చెప్పగలిగాడు. అంతేకాదు దానిని భక్తి పారవశ్య గీతాలలోగూడ చెప్పగలిగాడు

అమెరికా అంతటా అతడంటేవెర్రెక్కి పోతోంది. నటి డెమీమూర్, గాయకుడు నోమిజడ్, జార్జిహారిసన్, మైకల్ జాక్సన్, డిజైనర్ డొనకరన్, మైకల్ మిల్కమీన్‌లాంటి ప్రసిద్ధులు ఆయనను గురువుగా భావిస్తున్నారు. గురువు అనే పదాన్ని ఆయన ఒప్పుకోక పోయినా, ఆస్థానాన్ని ఆయనకు ఇస్తున్నారు

ఇతడు క్వాంటమ్ హీలింగ్ అనే గ్రంధాన్ని రాశాడు. అందులో మానవాత్మ, దేహం అత్యంత సన్నిహితంగా ముడివడి ఉన్నాయని ప్రతి పాదించాడు ఈవిషయం తాను చదివిన పాఠ్యాంశాలలో ఎక్కడా లేదని, ఆగ్రంధాన్ని అలా అలా తిరగేసి ప్రక్కన పడవేశాడు డా॥ హోవర్డు ఫ్యూర్స్ట్ . ఈడాక్టరు శస్త్రచికిత్స వీలుకాని ప్రొస్ట్రేట్ పుట్ట కురుపుతో బాదపడుతున్నాడు. మళ్ళీ ఆ గ్రంధాన్ని ఒకసారి తిరగవేశాడు. ధ్యానం, తగు ఆహారం, పాశ్చాత్యీకృత హిందూ మార్మికత ఈ వ్యాధిని తగ్గించవచ్చని ఆ గ్రంథం నుంచి గ్రహించాడు. రోజూ 30 నిముషాలు ధ్యానం చేశాడు. ఐదు నిముషాలు ప్రార్థించాడు. చోప్రా ప్రతి పాదించిన పది సుఖ సూత్రాలు వల్లె వేశాడు. గమ్మత్తు ఏమిటంటే అతడికి పూర్తిగా ఆ కణితి నయమై పోయింది. కొన్ని సార్లు కణుతులు వాటంతటఅవే నయమవుతాయి. అయినా అతడు ఆ ప్రార్థనా బలాన్ని నమ్మాడు.

1993లో Ageless Body and Timeless Mind అనే గ్రంధాన్ని రాశాడు ఆ తరవాత ఇంకా చాలా రాశాడు ఆయనే పుస్తకాలు, టేపులు, విపరీతంగా అమ్ముడు పోతున్నాయి. విశ్వస్థాయిలో చూస్తే, మనమంతా ఏకకాలమందే విశ్వమంతటా ఉంటామని ప్రతిపాదిస్తాడు. బహుశా, టి.వి చూడని వారికి గూడ, ఈలెక్కన చూస్తే, అనతి కాలంలోనే అతడు ఎదురుగా దర్శనమీయవచ్చు ''వైద్యం-విశ్వాసం'' సమ్మిశ్రమానికి కావలసిన పదజాలాన్ని ఆయన అందిస్తున్నాడు.

అసలు ఇతడు కొంతకాలం ''అతీతధ్యానం'' T.M. సంప్రదాయ గరువైన మహర్షి మహేష్‌యోగి శిష్యుడు. '' ఇప్పుడు, ఇక్కడ'' లకు కట్టుబడకుండా వాటిని అధిగమించేప్రక్రియగా కొన్ని హిందూ సంప్రదాయాలవారు అతీత ధ్యానాన్ని కొనసాగిస్తారని ప్రాశ్చాత్యులకు తెలుసు. అలా అధిగమించినప్పుడే, కాలదేశాతీతంగా ఉండి ఈ విశ్వాన్ని చైతన్యంగావించే యధార్ధ చేతన లేదా పారమార్థిక చేతనతో ఐక్యం అవడానికి వీలవుతుందని ఆ హిందూ సంప్రదాయాల వారు

భావిస్తారు దీనినే చోప్రా ప్రచారంచేసింది ఆ తరవాత మహేష్ యోగితో విభేదాలు కారణంగా తన స్వంత సంప్రదాయాన్ని నెలకొల్పుకొన్నాడు ఆతరవాతనే Ageless Body and Timeless Mind రాశాడు ఈగ్రంథం ఒక కలగూరగంప అందులో నిజ జీవిత సంఘటనలను వివరించాడు సాహితీ విషయాలను ఉటంకించాడు పాదసూచికలు లేకుండా శాస్త్ర విషయాలను ప్రస్తావించాడు డాస్టోవిస్కీ, ఋగ్వేదం, జర్మన్‌శాస్త్రవేత్త వెర్నర్‌హైజన్‌బర్గ్, మీరు ఇంటి దగ్గర చేసుకొనడానికి వీలైన యోగాసనాలను తడిమాడు ఆ గ్రంథం అంతస్సారాన్ని ఇలా చెప్పవచ్చు; మనకు గట్టిగాను, సొంతంగా (పరిమితంగా) కనిపించే ఈ దేహాలు నిజానికి అలాంటివి కావు ఎందుకంటే, మన శరీరంలోని నిర్మాణకణువులు ఎప్పటికప్పుడు క్రమంతప్పక పునఃప్రతిష్ఠించడం జరుగుతుంది అలాంటప్పుడు మనం ''వయస్సు పెరుగుతున్న అవయవాల మార్పు కాకుండా, నిత్యం ప్రగమించే ఆకృతులం'' ఆణు స్థాయిలో మనలను మనం చూసుకొన్నప్పుడు, మనం మన చుట్టూ ఆవరించి ఉన్న పరిసరం నుంచి మనలను వేరుగా చూపడం సాధ్యం కాదు గుళికా భౌతిక శాస్త్రం (Quantum Physics)''శక్తి పదార్థాలు పరస్పర పరివర్తనీయాలు'', అని చెబుతున్నప్పుడు, మనం ప్రత్యేక వ్యక్తులం కాము, అనంతమైన శక్తి క్షేత్రం యొక్క స్థానిక అభివ్యక్తులం మాత్రమే. మనం గూడ శక్తి క్షేత్రాలం మాత్రమే. మనలో ప్రతి ఒక్కరం ఈ మహా విశ్వాన్ని నిర్దేశించే ప్రజ్ఞతో ముడిపడి ఉన్నాము. మన దేహాలు ఈ విశ్వ దేహంలోని భాగాలు, మనమనస్సులు విశ్వమనస్సు విభూతులు.

ప్రాథమిక స్థాయిలో చూస్తే, అది ''ఒత్తిడిని తగ్గించుకోవడం'' లేదా ''శరీరం ఏమి చెబుతుందో వినడం'' కంటే భిన్నం కాదు. విశ్వ మనస్సుతో ధ్యానం ద్వారా ఐక్యం చెందిన వారు కొన్ని ఆయుర్వేద క్రియలు చేసిన వారు అనేక రోగాలను పరిహరించ వచ్చు. చివరకు జరాప్రభావాన్ని(ముసలితనం ప్రభావాన్ని) పరిహరించి 130 సంవత్సరాల వరకు సుఖంగా హాయిగా జీవించవచ్చు నంటాడు చోప్రా. మనకు చావంటే భయం ఉండాల్సిన పని లేదు, ఎందుకంటే, మనం అవశ్యం విశ్వక్షేత్రంలో భాగాలం కనుక, విశ్వం అమరం కనుక, మనమూ అమరుల మేనంటాడు చోప్రా.

చాలమంది చోప్రా చెప్పేదానితో ఏకీభవించరు అతడు చెప్పే గుళికా భౌతిక విజ్ఞాన శాస్త్రం వట్టి చెత్త అంటారు. వైద్యంలో మోసానికి వ్యతిరేకంగా పని చేసే జాతీయ సంస్థ, చోప్రా చెప్పే ''రోగ తిరోగమనం'' మహాప్రమాదకరం అంది. ఎప్పుడు వాస్తవం చెప్పేది ఎప్పుడు రూపకం వాడేది విడదీయమంటే, దానికతడు ఒప్పుకోడు. అందుకని అతడు చెప్పేదానిలో అంతా సందిగ్ధతే రాజ్యమేలుతుంది. ఆయన రోగనిదానోపచారాలను ఎండగట్టే వారు చాలమంది ఉన్నారు. విశ్వమమనస్సు ఒకటి ఉందో లేదో ఉంటే ధ్యానం ద్వారా ఐక్యం కావడం వీలవుతుందో లేదో సందేహాస్పదమే. ఎన్ని ప్రార్థనలు చేసినా, ఎంత మత విశ్వాసాన్ని పెంచుకొన్నా రోగాలకు మందులు తినక కుదరడం లేదు. అయితే మనస్సు, శరీరం రెండూ విడదీయరానివి. మన ఆలోచనలు, మనలను అలాతయారు చేస్తాయి అంటుంది బౌద్ధం అంటే ఆలోచనలు శరీరంలో మార్పులు తెస్తాయనేది నిజం, ఏది ఏమైనా శరీరం, మనస్సు, ఆత్మ వైద్య విధానం- అది మందుల ద్వారా గాని, ప్రార్థనల ద్వారా గాని- ధ్యానం ద్వారా గాని, అన్ని శాస్త్రీయ ప్రమాణాలకునిలబడాలి

కొత్త వెలుతురు

# పిశాచ పీడిత ప్రపంచం

డా. యన్. ఇన్నయ్య

కార్ల్‌శాగన్ ఒక ఆకర్షణీయ, అపూర్వ శాస్త్రజ్ఞుడు ఆయన చనిపోబోయే ముందు (1996) ఒక పుస్తకం రాసిపోయాడు దాని శీర్షిక. దయ్యాల ప్రపంచం (The Demon haunted world) (62వ యేట 20 డిసెంబరు 1996న మరణించారు.)

శాగన్ ఏది రాసినా, చెప్పినా జనానికి అర్థమయ్యేట్లు, అందుబాటులో ఆచరించేటట్లు చేస్తాడు కాస్మోస్ పేరిట ఆయన రాసిన పుస్తకమూ అంతే, ప్రపంచ వ్యాప్తంగా కాస్మోస్ కార్యక్రమాలు టి.వి.లలో తిలకించిన వారికి యీ సంగతి తెలుసు. సైన్స్‌ను ఆకాశంనుండి భూమి మీదకు తెచ్చిన సైంటిస్టు శాగన్ సైన్స్ అంటే అదేదో మనకు తెలియని, గందరగోళ శాస్త్రం అనే భ్రమ తొలగించాడు. సైన్స్ నిపుణులు లోతుపాతులు గ్రహించి అనేక విషయాలు కనిపెడతారు. వాటిని సాంకేతిక నిపుణులు ఆచరణలో పెడతారు అదే ఉపయోగం, అందులోనే హానికూడా వుంది. హాని ఎక్కువ అతిశయోక్తులతో చూపి, అది సైన్స్‌కు అంటగట్టి, బూచిగా చిత్రించిన సందర్భాలున్నాయి.

కార్ల్‌శాగన్ ఖగోళ శాస్త్రజ్ఞుడు. కార్ల్ మార్క్స్ తత్వాన్ని భూమి మీదకు తెచ్చి జనంలో పడేయమన్నాడు. సైన్స్‌ను ఒక తత్వంగా చూచిన శాగన్ అదేపని సమర్థవంతంగా చేసి, ఎంతో సేవ జరిపిన వాడయ్యాడు

చుట్టూవున్న చీకటి చూసి, నిస్సహాయంగా కూర్చోవద్దు. ఒక కొవ్వొత్తి అయినా వెలిగించు. ఇదీ దయ్యాల ప్రపంచంలో శాగన్ సూత్రం. ఆయన సైన్స్ ప్రచారానికి పూనుకోలేదు యీ పుస్తకంలో. ఆ పని చేసే వారు చాలా మందివున్నారు.

సైంటిఫిక్ మెథడ్ (శాస్త్రీయ పద్ధతి) ఒక కొవ్వొత్తిగా స్వీకరించమన్నాడు. ఎన్ని ఒడిదుడుకులున్నా, రాగద్వేషాలున్నా, సైన్స్‌ను ముందుకు నడిపించి, మనుషులకు ప్రగతి చూపి, ఇంత వరకూ రావడానికి మూలకారణం శాస్త్రీయ పద్ధతే అంటే, సైన్స్‌కూ, సైంటిఫిక్ మెథడ్‌కూ తేడా చూపుతున్నాడన్నమాట. తెలుసుకోవడం, ప్రశ్నించడం, తప్పు అయితే దిద్దుకోవడం, విషయసేకరణ, కొత్త ఆలోచనల్ని పరీక్షకు పెట్టడం, అందుకు సాక్ష్యాధారాలు చూపడం, పరీక్షకు నిలవకపోతే కొట్టిపారేయడం, నిలిస్తే సిద్ధాంతీకరించడం, దేనినీ పవిత్రం పేరిట ప్రశ్నించకుండా వదలకపోవడం, మనం చిరకాలంగా నమ్మేది శాస్త్రీయంగా తప్పు అని రుజువైతే అంగీకరించడం - ఇదే శాస్త్రీయ పద్ధతి. కొన్నిసార్లు శాస్త్రజ్ఞులే అనుసరించలేక పోతున్నారు. కాని అదే అవసరం.

కార్ల్ శాగన్ తన 457 పుటల గ్రంథంలో స్వానుభవాలు జోడించి, ఏదో లోకాల్లో ఎవరో ఆకాశ వ్యక్తులున్నారనే భ్రాంతుల్ని తిరస్కరించాడు. ఎగిరే పళ్ళాల వెనుక వున్న భ్రమల్ని బయటపెట్టాడు. ప్రతి శాస్త్రానికి ప్రతి బింబంగా వున్న అశాస్త్రీయ రూపాల్ని చూపాడు. ఉదాహరణకు ఖగోళశాస్త్రం ఒక వైపు, జ్యోతిష్యం మరొక పక్క చూపాడు.

25 అధ్యాయాలుగల యీ పుస్తకం ఎక్కడా బోర్ కొట్టదు. అర్థం చేసుకోడానికి తల

---

**డా. యన్. ఇన్నయ్య** ప్రసిద్ధ పాత్రికేయుడు. ప్రస్తుతం అమెరికాలో ఉంటున్నాడు.

బొప్పికట్టదు. నిఘంటువులు భూతద్దాలతో చూడనక్కరలేదు అంతగా విడమరచి శాగన్ చెప్పాడు ప్రకృతి అద్భుతాలను ఆనందించాలి. అనుభవించాలి, అంతటితో ఆగక, తెలుసుకోవాలి. ఇది నిరంతరం సాగవలసిన జిజ్ఞాస. పూజిస్తే తెలుసుకోలేం. ఆరాధిస్తూ కూర్చుంటే అంతుబట్టదు అంతు తేల్చుకోవాలనే శాస్త్రీయ పట్టుదలవుంటే కొంత ముందుకు పోతాం. అలా పోవడంలో ఆనందంవుంది. ఆపని చేయమని శాగన్ ప్రోత్సహిస్తున్నాడు.

ప్రభుత్వాలు తప్పులు చేయకుండా చూచే బాధ్యత ప్రజలదని సూత్రీకరించాడు. ఇందుకు తల క్రిందులుగా వ్యవహారం సాగిపోతున్నది. వ్యక్తులు తప్పులు చేస్తే దిద్దుకోవడం సులభం. ప్రభుత్వాలు చేస్తే, సమర్థించుకోడానికి ప్రయత్నిస్తాయి. అదే ప్రమాదం

ప్రతి అధ్యాయానికీ రిఫరెన్స్ గ్రంథాలపట్టిక శాగన్ చూపాడు చాలా అందంగా గ్రంథం ముద్రించారు. ఖరీదునుబట్టి అందరూ కొనడం యిబ్బందికరం గనుక, గ్రంధాలయాలకు, సంస్థలకు, కాలేజీలకు తెప్పిస్తే, చాలామందికి ఉపయోగపడుతుంది.

శాగన్ గురించి కొంత వ్యక్తిగత అనుభవం చెప్పడం మంచిదేమో. నేను ఆయనతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాను. తీరిక లేని సైంటిస్టుగా, అమెరికాలోని కార్నెల్ యూనివర్శిలో డంకెన్ ప్రొఫెసర్‌గా వుంటూనే, నాకు జవాబులు రాశాడు. ఒక ఉత్తరంలో భారతదేశంలో మానవవాద మిత్రులకు మీద్వారా శుభాకాంక్షలు అందజేస్తున్నాను అన్నాడు. అదే చివరి ఉత్తరం భద్రంగా జ్ఞాపికగా అట్టిపెట్టాను. వాషింగ్టన్‌లో రెండు పర్యాయాలు శాగన్‌ను కలిశాను. ఫొటొ తీయించుకున్నాను. వివాదాస్పద విషయాలు కూడా చాలా ఆహ్లాదంగా చెబుతారు

**CARL SAGAN:**

The Demon - Haunted world Science As a Candlo in the Dark PP 457 1/8 Demmy 1996 $ 30, Random House, New York

In return, Lawrence was none too complimentary about the University. In the poem Nottingham's New University, he wrote disparagingly of the project for a seat of learning funded by the millionaire founder of Boots, the chemist; In Nottingam, that dismal town where I went to school and college, they've built a new university for a new dispensation of knowledge. Built it most grand and cakeily out of the noble loot derived from shrewd cash-chemistry by good Sir Jesse Boot.

He was even less complimentary about Englishmen in general after deciding to quit the country. He wrote: "Curse the blasted, jelly-boned swines, the slimy, the belly-wriggling invertebrates, the miserable sodding rotters, the flaming sods, the snivelling, dribbling, dithering pulse-less lot that make up England today."

Frieda's letters document her battle with Lawrence's brother, George, for possession of his entire estate, rather than a half share. She won in 1932.

*(Continued on page 154)*

# గియోర్గి లుకాచ్ సౌందర్య శాస్త్రం

**- డాక్టర్ తక్కోలు మాచిరెడ్డి**

గియోర్గి లుకాచ్ గొప్ప మార్క్సువాద మేధావి, సౌందర్య శాస్త్రవేత్త. హంగరీకి చెందినవాడు. స్టాలిన్ కాలంలో రష్యాలో వున్నా స్టాలిన్‌ని సమర్థించలేదు పిడివాది కాడు. తనదంటూ ఒక పంథా రూపొందించుకున్నాడు లుకాచ్. మార్క్సువాదంలో సూత్రీకర ణ లకు తావులేదనీ, సంప్రదాయాన్నంతటినీ అర్థం చేసుకొని దాన్ని అధిగమించా లంటాడు లుకాచ్. స్టాలిన్ కాలంలో మార్క్సువాదాన్ని సంప్రదాయానికి వ్యతిరేకం చేసుకోవడం జరిగిందనీ, ద్వంద్వాత్మక భౌతికవాదం కంటే, చారిత్రిక భౌతిక వాదానికి అతిగా ప్రాముఖ్యం యిచ్చారనీ, యిది తప్పు అనీ భావించాడు లుకాచ్.

సౌందర్యశాస్త్ర పరిధిలోకి ప్రకృతి సౌందర్యం కూడా వస్తుందని లుకాచ్ అభిప్రాయం సారంలో, ఆంతరిక సంరచన (నిర్మాణం) లో ప్రకృతి సౌందర్యము, కళాకృతి సౌందర్యము ఒకటే అని భావించాల్సి వుంటుంది. అలాంటపుడు కళాకృతి సౌందర్యాన్నే కాదు, సుందర వస్తువుల, సుందర ప్రకృతి సౌందర్యాన్ని కూడా సౌందర్య శాస్త్ర పరిధిలోకి తీసుకోవాల్సి వుంటుంది

మార్క్సువాద తత్వశాస్త్రంలో అస్తి (Being), చేతన ( Consciousness) ల మధ్య సంబంధాల్ని గురించిచర్చ ఒక ప్రముఖమైన అంశం. చేతనకంటే అస్తికి ప్రాముఖ్యం యివ్వడం జరిగిందనే ఆరోపణ వుంది. ఈవిషయంగా తన అవగాహన గురించి రాస్తూ చేతన లేకుండా అస్తి వుండగలదు. కాని దీనర్థం చేతన అస్తికంటే ఎక్కువది లేక తక్కువదనీ కాదు. వాస్తవ మేమిటంటే అస్తి ప్రాథమికతను గుర్తించడంలో అస్తిని చేతన జయించే సంభావ్యత యిమిడివుంది అని అభిప్రాయపడతాడు లుకాచ్.

ఆధారం (Base), అధిరచన (Super-structure) ల మధ్య కార్యకారణ సంబంధముందని వికృత భౌతికవాదం బోధిస్తుంది. ద్వంద్వాత్మక పద్ధతి యిలాంటి మొరటు, ఏకపక్ష కార్యకారణ సంబంధాల్ని నిరసిస్తుంది. మారిన పరిస్థితుల్లో, ఆధిరచనకు తగినపాత్ర యివ్వాల్సి వుంటుందని గియోర్గి లుకాచ్ అంటాడు.

కళను నిర్వచిస్తూ ''రూపం సాయంతో ధ్వనియే కళ'' అంటాడు లుకాచ్. కళ మనల్ని జాతిమతాలకు అతీతంగా వుంచుతుంది. దేశ కాలాలకు అతీతంగా చేస్తుంది. కళ గొప్ప క్షణాల్నిస్తుంది; గొప్ప క్షణాల్నిస్తుంది కాబట్టే కళ ఒక జీవిత విలువ అయింది. ఒక విలక్షణమైన, సంశ్లిష్టమైన, గంభీరమైన విలువ అయింది. కళ సంప్రేషణ (Communication) మాత్రమే కాదు అది మనల్ని ప్రేరేపింప (Evoke) చేస్తుంది అని అంటాడు లుకాచ్.

మానవీయత, రూపము కళలన్నిటి ప్రధాన సమస్యలు కవి అనుభూతి తీవ్రతను

---

★ **డా. తక్కోలు మాచిరెడ్డి** ఆకాశవాణి, అనంతపూర్‌లో అసిస్టెంట్ స్టేషన్ డైరెక్టరుగా ఉంటున్నారు. సౌందర్య శాస్త్రాన్ని నిశితంగా అధ్యయనం చేశారు.

సహృదయునికి అందజేసేశక్తి సంప్రేషణలో కాదు, ప్రేరేపించడం (Evocation) లో వుంది. ఇది, దాదాపు స్వతంత్ర ప్రతిపత్తికల్గిన అభివ్యక్తి సాధనాల భావావేశోత్పాదక అనుభూతిపైన గానీ, కవి అనుభూతి తీవ్రతపైగానీ పరిమితంగానే ఆధారపడుతుందనే విషయం మరువకూడదు కవి అనుభూతిలో మసమసకగావుండే తీవ్రతను యినుపడింప జేసే, ప్రేరేపింపజేసే శక్తి కొంతవరకు అభివ్యక్తి సాధనాలలో వుంది ఈతీవ్రత వచ్చేది కవి అనుభూతి నుంచా లేక అభివ్యక్తి సాధనాల నుంచా అనేది నిర్ణయించడం దాదాపు అసంభవం సహృదయునిలో సంప్రేషిత కవి అనుభూతీ, దాని సంప్రేషణీయతా (Communicability) రెండూ అన్యోన్యంగా పెనవేసుకొని వుంటాయి

మానవీయత సాహిత్యానికి మూలస్తంభము. మానవతావాదం, లేక మానవ స్వభావపు ఆవేగమయ అధ్యయనం సమస్త సాహిత్యానికీ, సమస్త కళకూ మూలం మనిషి హుందాతనంపై జరిగే సమస్త ఆక్రమణల నుంచి కాపాడేది మానవతావాదమే, అదే ప్రతిఫలిస్తుంది సాహిత్యంలో

పెట్టుబడివాద సమాజంలో నివసిస్తున్న ప్రతివ్యక్తికీ వస్తీకరణ (Reification) అనేది అవశ్యమైన ఒకవాస్తవం దీన్ని వదిలించుకోవాలంటే నిరంతరం అస్తిత్వపు, వస్తీకృత నిర్మాణాన్ని ( సంరచనను) విచ్చేదం చేయాల్సి వుంటుంది. ఇది ఎలా సాధ్యమంటే సంపూర్ణ వికాసపు స్పష్టమైన వైరుధ్యాలను, ఆ వైరుధ్యాల అంతర్గాన్ని గురించిన ఎరుక పెంచుకోవడం ద్వారా యిది సాధ్యం.

సాహిత్యంలో వస్తువు, రూపము వుంటాయి. వస్తువు కెంత ప్రాముఖ్యం యిస్తామో, అంతే ప్రాముఖ్యం రూపాని కివ్వాలి. లుకాచ్ రూపవాది కాడు, కానీ రూపం ప్రాధాన్యతను నొక్కి చెబుతాడు. రూపం జీవితం పట్ల మనకు కల్గించే ఒక విశ్వదృష్టి, ఒక అభిప్రాయం - ఒక వైఖరి. అంతేకాదు; జీవితాన్ని రూపొందిచడంలోనూ, నవీకరించడంలోనూ రూపం పాత్ర వుంటుంది. రూపాన్ని గురించి రాస్తూ లుకాచ్, మరోచోట అతిశక్తివంతమైన శాశ్వత అభివ్యక్తికి సరళతమమైన మార్గం రూపమని అంటాడు. రూపం చూస్తే కవి లేక కళాకారుని దృక్పథం తెలిసిపోతుందంటూ జీవితపు అత్యున్నత న్యాయనిర్ణేత రూపమనీ, వస్తువుకు రూపాన్నివ్వడం, ఒకతీర్పిచ్చే శక్తి అనీ అంటాడు. అధునాతన యుగంలో పద్యాలు రాసేవారు ఎన్నిచెప్పినా, రూపరీత్యావాళ్లు ఆధునికులుకారు, రూపానికీ కథ్యానికీవున్న సంబంధాన్ని గురించి రాస్తూ లుకాచ్, ఏదంతా కథ్యమో దానిసారం రూపం. ఈ కథ్యం క్లుప్తీకరింపబడి వుంటుంది. ఎంతవరకూ అంటే, మనల్ని అది క్లుప్తత వైపేగాని దాని విషయం పైకి పోనివ్వదు అని అంటాడు.

కవితను గురించి రాస్తూ మరే యితర కళకంటే అధికంగా కవిత యుగ మానసంతో ప్రభావిత మౌతుంది అని అంటాడు గియోర్గి లుకాచ్. 'నూతన' గేయ కవితను ( కాల్పనికతావాద కవితను) గూర్చి ప్రస్తావిస్తూ అది ''పాఠ్యం, ధ్వని, రాగం, పక్కవాద్యం అన్నీను ఏకకాలంలో ఏ యితరమూ ఆశించని ఒక స్వయంపూర్ణ రచన'' అని అంటాడు లుకాచ్.

కళారూపాల ప్రసక్తి వచ్చినపుడు, ''వ్యాసం ఒక కళారూప'' మని నిక్కచ్చిగా చెబుతాడు లుకాచ్. సాహితీ రూపాల్ని పట్టకం గుండా వక్రీభవనం చెందిన సూర్యరశ్మిగా భావిస్తే, వ్యాసకర్తల

రచనలు ఆ సూర్యరశ్మిలోని అతినీల లోహిత (Ultraviolet) కిరణాలు అవుతాయి అని చక్కని బింబము మన ముందుంచాడు గియోర్గి లుకాచ్

రష్యను రచయిత తొల్స్తోయ్‌ను గురించిన లుకాచ్ అవగాహన ఈ విధంగా వుంది. పెట్టుబడివాద స్వరూపాన్ని గురించి తొల్స్తోయ్ కి తక్కువే తెలుసు. కార్మికవర్గ విప్లవ ఉద్యమాన్ని గురించి ఆయనకు సరియైన అవగాహన లేదు. కాని రష్యను సమాజపు నిజమైన నిలువెత్తు చిత్రాలు, జీవితం తొణికిసలాడే పాత్రలు ఆయన మనకిచ్చి పోయాడు. ఇది ఎలా సాధ్యమయిందంటే తొల్స్తోయ్ తిరుగుబాటు చేస్తున్న రైతుల దృష్టితో సమాజాన్ని చూశాడు. ఆ రైతు ఉద్యమానికి కొన్ని పరిమితులున్నాయి. కొన్ని దోషాలున్నాయి తొల్స్తోయ్‌లోనూ ఇవి ప్రతిబింబించాయి. తనపూర్తి ఉత్కృష్టరచనా కాలంలో రాసిన ప్రతి రచనలోనూ ప్రపంచ దృక్పథానికీ, సృజనాత్మకతకూ మధ్య సంక్లిష్టమైన, ధనాత్మక, ఋణాత్మక పరస్పరక్రియాశీలతను తొల్స్తోయ్ ప్రతిబింబించాడు అని భావిస్తాడు లుకాచ్.

ఉపయుక్త గ్రంథాలు

1. Gyorgy Lukacs - His life and works - Ed. Gyula Csak
2. Studies in European - Realism - Gyorgy Lukacs
3. Soul and Form - Gyorgy Lukacs

John Worthen, professor of Lawrence studies and Head of the English department at Nottingham, said the highlight of the archive was the manuscript for The White Peacock, the author's first novel. Drafted while he was an undergraduate , 629 of the 798 pages are in Lawrence's hand.

Professor Worthen said; "This is the real gem because all the other manuscripts of his novels are in America, so we are extremely pleased to have it here The archive also contains an extraordinary number of which are one of only two or three which survive." They include a rare copy of at least one novel on blue paper. Lawrence, forced to publish in Italy by his prosecution for obscenity over The Rainbow in 1915, the first two copies of every work published in this way, one for himself, the other for Frieda.

Professor Worthen added: " George Lazarus collection utterly transforms the research value of our holdings. It is particularly appropriate that these materials are now in Nottingham."

# కృష్ణశాస్త్రి పద్యశిల్పం

- డా.యు.ఎ. నరసింహమూర్తి

కృష్ణశాస్త్రి కవికుటుంబం నుండి వచ్చినవాడే కాని అతని పద్యనిర్మాణ శిల్పం తన పూర్వులకంటె భిన్నమైనది, స్వతంత్రమైనది అయితే, 'ఎలా రాయకూడదో తెలుసుకోవడానికి మాత్రమే ప్రాచీన కవిత్వాన్ని చదవాలన్న' శ్రీశ్రీ అభిప్రాయంతో కృష్ణశాస్త్రి పద్యంలో ఒక పార్శ్వం ఏకీభవించదు. పద్యనిర్మాణంలోని విన్నాణాలను ఆయన పాతపద్యాల నుండి కూడా ఏరుకున్నాడు. 'కవిత్వం శబ్దరూపంలో ఉన్న గానం' అన్నాడాయన గానం 'నిర్గీతి- బహిర్గీతి' అని రెండురకాలు నిర్గీతిలో ఆలాపన మాత్రమే ఉంటుంది బహిర్గీతికి సాహిత్యం కూడా ఉంటుంది ప్రాచీనుల దృష్టిలో బహిర్గీతి శ్రేష్ఠమైనది ఆధునికులు నిర్గీతిని వరించారు. ఈ రెండింటి సమన్వయం కృష్ణశాస్త్రి పద్యనిర్మాణంలో కనిపిస్తుంది. ఆయన ప్రజ్ఞకలవాడు. ఆయన పద్యనిర్మాణం ఉపజ్ఞతో కూడిన ఆద్యజ్ఞానంతోపాటు, వ్యుత్పన్నతను కూడా జోడించి నవవికాసాన్ని సాధించింది. ప్రతిభా వ్యుత్పత్తులు పరస్పరం కలిస్తే పద్యం శ్రేయోమార్గంలో పడుతుంది.

భావకవితోద్యమానికి నాయకత్వాన్ని పొందడంలో కృష్ణశాస్త్రిలో ఒక ప్రత్యేకత ఉంది. పద్యానికి రెండు నిర్మాణాలుంటాయి. 1. బహిర్నిర్మాణము 2 ఆంతర్నిర్మాణము ఆయన తన వ్యుత్పన్నతను బహిర్నిర్మాణానికి పరిమితం చేసి అంతర్నిర్మాణంలో ఉపజ్ఞను ప్రదర్శించాడు అపరిచితము, అచూచితము, అద్భుతము అయిన ఆ నిర్మాణం అందర్నీ సమ్మోహితుల్ని చేసింది కాల్పనిక కవిత్వం ఆదర్శవాదం, సౌందర్యవాదం, స్వేచ్ఛావాదం అనే త్రివేణీ సంగమం అందుకే కృష్ణశాస్త్రి పద్యనిర్మాణంలో ఒక ఆదర్శం, ఒక సౌందర్యం, ఒక స్వేచ్ఛ ప్రధానలక్షణాలయ్యాయి ఆ స్వేచ్ఛాకుమారుడి పద్యాలకు సాంద్రత- సంక్షిప్తత అదనపుశక్తులు. ఈ శక్తులతో తెలుగు పద్యానికి కొత్త పొరాలు నేర్పేడు కృష్ణశాస్త్రి అతని పద్యం 'ప్రతిపద మ్మన్వృత జీవప్రతిభపులకరించి పలుకరించిన కొత్త బలముతో చలముతో' సాగుతుంది విషాద మాధుర్యం ఆయన కవితాప్రతిష్ఠ అయితే విషాదం అతని భావాల్లో నిండి, మాధుర్యం ఆయన పద్యాల్ని ముంచెత్తింది

పద్యనిర్మాణంలో విశ్వనాధకున్న నిర్లక్ష్యం కృష్ణశాస్త్రికి లేదు శ్రీశ్రీలా 'అరిస్తే పద్యం' అని కూడా ఆయన అనుకోలేదు అలవోకగా పద్యం రాయడం ఆయన అలవాటు కాదు. ఆయన పద్యాలు పాత మూసల్లో పోసిన పంచలోహ విగ్రహాలు కావు. ఉలితో ఏకాగ్రంగా చెక్కిన శిలాశిల్ప నైగనిగ్యం, దారుశిల్పస్నిగ్ధ సౌష్ఠవం ఆపద్యాలకు ప్రాణం పోస్తాయి 'ఎదమెత్త నగుటకై సొదగుందరా' 'కురియుమురా కన్నీటిని మరిమరి విలపింపుమురా' అన్న పౌనఃపున్య చింతన పద్య నిర్మాణ సమయంలో అతనిలో నివాత దీపకళికలా నిలుస్తుంది.

"Chısel and carve and file

Till thy vague dream imprınt

It's smile

On the unyielding flint" - అన్న గోధె మాటలు కృష్ణశాస్త్రి పద్యాలకు ప్రాణప్రతిష్ఠ చేసేయి. సుఖస్వప్న దరిద్రమైన బ్రతుకును గూర్చి రాసినా 'పొంచిపొంచి తన(నా) లో మూలమూలలందు క్రుంగిక్రుంగి యడంగిదాగుండు గీతి' అస్పష్టస్వప్నం- తలవంచని కఠినశిల చిరునవ్వుచిగుళ్లు పెట్టేదాకా చెక్కిమలిచి మెరుగు పెట్టేనేకాని తృప్తిపడడు పద్యానికింత పరీక్ష పెట్టిన ఆధునికుడు

---

**డా. యు.ఎ. నరసింహమూర్తి** విజయనగరం మహారాజ స్వయం ప్రతిపత్తి కళాశాల తెలుగు శాఖలో రీడరుగా పనిచూస్తున్నారు సాహితీ విమర్శకులు కథా రచయిత

కృష్ణశాస్త్రే అదొక నిరంతరాభ్యాసం విశ్వనాథలా అతని మనసు మాడే కొఱని కాదు పొగరాని కుమ్ము. అందులో పుటంపెట్టి పద్యాన్ని పైకి తీస్తాడు.

'చూచితిరొ లేదొ చిన్ని కృష్ణుని సొబగు?
పెదవి చివురు సంజల నరవిచ్చునవ్వు
వెన్నెల, చలించు తుమ్మెద బెళుకు చూపు
లోలపవన చాలిత కుటిలాలకమ్ము
తరళ చూడాకలాపమ్ము, మురళిగూడి
యల్లనల్లన గొంతెత్తి యమృత గాన
శీతల తుషారముల విరజిమ్ము వేళ
చిన్ని కృష్ణుని సొబగు చూచితివొ లేదొ?

పద్యానికి కూడా లైను (Line), లెంక్తూ (Length) లోతూ, వైశాల్యం ఉంటాయని ఈ పద్యాన్ని చూస్తే ఎవరికైనా తెలుస్తుంది. ఇందులో మార్మికత ఏమీ లేదు మార్మికత నిండిన పద్యాల్లో పొడవు, వెడల్పు, లోతు, వైశాల్యం కనిపించేలా పద్యం సరిహద్దులు క్రమంక్రమంగా విస్తరించేలా నిపుణమైన పనితనాన్ని ప్రదర్శిస్తాడు కృష్ణశాస్త్రి. కాని పద్య నిర్మాణ విషయంలో ఆయనొక సాంకేతిక నిపుణుడు మాత్రమేకాదు వస్తుతః ఆయన అచ్చమైన కళాకారుడు కళాకారుడు సాంకేతికతను, సాంకేతికనైపుణ్యాన్ని తన లక్ష్యసాధనకు ఉపకరణాలుగా స్వీకరిస్తాడు కేవలం సాంకేతిక నిపుణుడు వాటితో తన పద్యాన్ని అలంకరించడమే లక్ష్యంగా ప్రవర్తిస్తాడు పై పద్యాని ఒక సాంకేతికనిపుణుడు రాస్తే గోడకు కొట్టిన తైలవర్ణరంజిత చిత్రంలా ఉంటుంది కాని అందులో 'అమృతగాన శీతల తుషారముల విరజిమ్ము' చలనం ఉండదు. కవితానిర్మాణ సామర్థ్యం గల పాతకళాకారుడు కూడా పై పద్యం రాయగలడు. 'నల్లనివాడు పద్మనయనంబులవాడు కృపారసంబుపై జల్లెడువాడు నవ్వురాజిల్లెడు మోము వాడొకడు' అన్న పద్యాన్ని పై పద్యాన్ని పోల్చిచూస్తే వసంతం నుండి హేమంతం దాకా విస్తరించిన కృష్ణశాస్త్రి పద్యనిర్మాణకుశలత వెల్లడౌతుంది.

'శర్వరీ శీతపవన పక్షముల మలసి
స్వాదుయమునోర్మి సంగీత ఝరుల గలసి
కౌముదీధౌత శుభ్ర దిక్తటుల సొలసి
మురళికా మంద మంద మాధురుల రుచులు' వంటిపద్యాలలో

పద్యాన్ని ఊర్జస్వలం చేసే కృష్ణశాస్త్రి ఉపజ్ఞ సాక్షాత్కరిస్తుంది మలసి-కలిసి-సొలసి అనే అసమాపక క్రియలతో మాంద్యాన్ని త్రిగుణితం చేసాడాయన రాత్రి శీతగాలుల రెక్కలు, యమునాకెరటాల సంగీత ప్రవాహాలు, వెన్నెల్లో పరిశుభ్రం చేయబడిన దిగంచలాలు బాలగోపాలుని మురళీ రవానికి మాంద్యాన్నేకాక మృదుస్పర్శను కలనాదాన్ని వింత జిగిని కూర్చేయి. అందుకే ఆ మాధుర్యం జిహ్వాకందేది కాదు. స్పర్శ - శ్రవణం - నయనం ఒక్కసారిగా మేల్కొనేలా చేసే ఈ పద్యశిల్పం ఏ ఇంద్రియానుభూతున్ని సృష్టిస్తుందో చెప్పగలమా? 'శ్రవణ - నయన - హృదయ రంజికమైన యేపనియైనా శిల్పము' అన్న మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారి మాట ఇక్కడ జ్ఞాపకం చేసుకోవాలి. జ్ఞానేంద్రియాలన్నింటిని దాటి వాటికి అతీతమైన చైతన్యాన్ని రంజింపగల శిల్పసౌష్ఠవాన్ని సాధించడం పద్యం పరమార్థం అనే అత్యాధునిక చింతనకు కృష్ణశాస్త్రి పద్యాల్లో అంకురార్పణ చేసేడు

కృష్ణశాస్త్రి పద్యం ఎంత సనాతన మైనదో అంత ఆధునికమ్మైనది. భవభూతి - శాఫోల చిటికెనవ్రేళ్లు పట్టుకుని నడకలునేర్చిన ఆపద్యం ప్రతి పదంలోనూ షెల్లీ - కీట్సులతో కరచాలనం చేస్తూనే ఉంటుంది వసంతం నుండి హేమంతం దాకా విసర్తించిన ఆపద్యంలో ఒక పురాణ సౌరభంతో పాటు చిక్కని భావుకతా స్పర్శ నిండి వుంటుంది. ఆ పద్యం స్పర్శవేరు. స్పర్శతో అంధుని మనోనేత్రం విచ్చుకున్నట్లు ఆపద్యం సోకినప్పుడల్లా తెలుగు విశ్వమే పరవశమయి వెంట పాడు తుంది; తెలుగు భువనాలు కళ్లు విచ్చుకుంటాయి. కృష్ణశాస్త్రి తెలుగుపద్యానికి మస్పణత్వాన్ని ప్రసాదించేడు. ఆ మస్పణత్వాన్ని సాధించడానికి ఆయన ఒక కొత్త భాషను సృష్టించుకున్నాడు. ఆ భాష భావకవుల నిఘంటు వయింది. పట్టు తివాసీల్లాంటి పద్యాలంతకు ముందు ఎందరో రాసేరు. శాద్వలాలపై పరచిన పదబంధాలు మాత్రం ఒక్క కృష్ణశాస్త్రి పద్యంలోనే కనిపిస్తాయి ప్రాయం చెల్లిన ప్రాచీన పద్యానికి పునర్యావనం ప్రసాదించిన పురుచక్రవర్తి కృష్ణశాస్త్రి అందుకే ఆయన భావకవులకు వంశకర్త అయ్యాడు

ఒక్కొక్క పద్యంలో ఒక్క తెలుగు పదమూ లేకపోవచ్చు. కాని అవన్నీ వెలుగు దారుల్లా కనిపిస్తాయి ఒక్కొక్క పద్యం ఎడతెగని సమాసమే కావచ్చును కాని పరుగు పందెంలో గీతదాటి ముందుకు బాగా దూసుకు పోయిన ప్రథమశ్రేణి స్ప్రింటర్‌లా పాఠకుడు తనను తానునిలద్రొక్కుకుని ఒక్కసారి వెనక్కి తిరిగి చూసుకుంటాడు పద్యం ఆగిపోతుంది అనుభూతి ఇంకా ఇంకా ముందుకు సాగిపోతుంది 'ఏది మరొక్కమారు' అన్న కోరికను రగిలిస్తుంది. వర్ణన, పదచిత్రకల్పన వంటి శైవలక్షణాలలో రూపొందే బహుముఖీనమైన వ్యంజకతా శక్తిని ఛందో బంధురత్వం (Metrical ambiguity) తో కూడా సాధించేడు కృష్ణశాస్త్రి. ఇది ఆయన పద్య శిల్పరహస్యం. తెలుగు పద్యంలో అది ఒక 'నవాబ్దాగమం'. అందుకే కృష్ణశాస్త్రి నాయకుడయ్యాడు.

'అందుసగము - ఇందుసగము ఉందు నేను' అన్నట్లుగా వాక్యానికి కూడా ' ఇంటా - బయట' అని ఉంటుంది. పాఠకుడు దాని ఉపరితలాన్ని చీల్చుకుని గర్భాన్ని చేరుకునేటప్పటికి పద్యానికుండే ఆకృతి - అల్లిక, వస్తువు - దాని వావివరసలూ, భావం - బాధురత్వం అన్నీ ఆకళింపుకు రావాలి. భావకవిత్వంలో వస్తువు దర్శించడంతోనే కవి దానిని తనకు తానుగా అభివ్యక్తం చేసుకుంటాడు. జారిపోతూ పారిపోతూ స్మృతిపథంలో దోబూచులాడే ఆ దర్శనం వాక్యం ఉపరితలం నుండి గర్భం దాకా కొనసాగే దూరంలో ఏదో ఒక అనిశ్చిత ప్రదేశంలో లంగరేసుకుని ఉంటుంది దానిని అందుకోలేకపోతే ఒకొక్కప్పుడు ఆ వాక్యం 'విజనపథం' లా ఉంటుంది ఒకొక్కప్పుడు 'అగాథ తమోరహస్యాం గణం'లా ఉంటుంది. ఒకొక్కప్పుడు జారిపడిన స్వప్నమో - నిజమో అనిపిస్తుంది ఇంకొకసారి ఆ వాక్యం చతుష్పథమై ' ఎన్ని ఎన్ని భావనక్షత్ర కాంతులో కుమ్మరిస్తుంది. దానితో ఆవాక్యానికి ఒక 'కొత్తబరువు' ఒక కొత్తయాస వస్తాయి వాక్యంలోని అత్యంతక్లిష్టమైన ఈ బహుముఖీనవ్యంజిత వ్యాపారాన్ని ఒక వాక్యమంతా కాని, ఒక పదబంధంకాని, ఒక పదంకాని, ఆఖరుకు ఒక సూక్ష్మాతిసూక్ష్మమైన అర్థచ్ఛాయగాని సాధించగలదు దాని రహస్యాన్ని ఛేదించడానికి ఆధునికులు సాహసోపేతమైన ప్రయత్నాలనేకం చేసేరు. అందుకు తగిన బీజం లేదా భూమిక కృష్ణశాస్త్రి పద్య శిల్పంలో మనకు కనిపిస్తుంది

అక్కిరాజు ఉమాకాన్తమ్ వంటి ప్రాచీన ఆలంకారికమార్గాను యాయులూ, నారాయణబాబు లాంటి సామ్యవాద చైతన్య పూరితులు, కవిత్వానికి పద పదార్థజ్ఞానానికి, తీవ్ర భావోద్వేగానికి మాత్రమే పరిమితం చేసిన జాషువా వంటి కవులు, పింగళి నాగేంద్రరావు వంటి సామాన్యజన హృదయప్రతిగ్రాహకులు చతురంగబలాల్లో కృష్ణశాస్త్రి పద్యశిల్పాన్ని, భావకవిత్వోద్యమాన్ని

ఎదుర్కొన్నారు ఆ పరిస్థితిని చూస్తే "A work of art is born as the - intellectual foundling" అన్న Lawrence Durell మాట జ్ఞప్తికి రాకమానదు సామాన్యజనానికి మౌలికరచనలు ఏయుగంలోనైనా దురవగాహంగా ఉండడం సహజమే కాని సంస్కృతకవిత్వాన్ని-ఆంగ్లకవిత్వాన్ని ఆకళించుకున్న సారస్వతేయులకు భావకవితామార్గం మరీ దురవగాహమైన దేమీ కాదు ఐనా ఎవరి పరిధిలో వారు ఈ దారి కడ్డునిలిచేరు

ఇక్కడ చరిత్రకు వ్యాకరణానికి అలంకారశాస్త్రానికి ఇంకా అనేక విషయాలకు సంబంధించిన సామగ్రి అంతా అట్టడుగున పడి ఉంటుంది. వాస్తవానుభవాలను వాసెనకట్టుకట్టి, వడపోతపెట్టి, ఎదలోపలి ఎదలోంచి, ఏకాంతయవనికలోంచి, గాఢమైన అనుభూతుల్లోంచి పదచిత్రాలు పరిమళిస్తాయి. కేవలం పదాలు అన్నిచోట్లా నిజాన్ని చెప్పలేవు నిర్దిష్టమైన ప్రమాణాన్ని చూపలేవు. కళ్లకు కనిపించే నిజాలు, వస్తువులు, దృశ్యాల నుండి వాటి వెనుక నుండే సత్యాలను వేరు చేసి ప్రదర్శించడానికి పదాల సామర్థ్యం చాలదు. ఆ అనిర్వచనీయ సౌందర్యాన్ని సాక్షాత్కరింపజేసే సామర్థ్యం పదచిత్రానికుంది. పద చిత్రాలు స్వతంత్రమైనవి అభివ్యక్తి బాహుళ్యం పదచిత్ర లక్షణం పదం స్వతంత్రమైనవి అభివ్యక్తి బాహుళ్యం పదచిత్రానికుంది పద చిత్రాలు స్వతంత్రమైనవి అభివ్యక్తి బాహుళ్యం పదచిత్ర లక్షణం పదం అందించే అర్థం కన్న పదచిత్రం అందించే అనుభూతి ఎక్కువ కాలం నిలుస్తుంది పదచిత్రం కవిబుద్ధిమూలకమైన అర్థాన్నేకాక, అతని అనుభూతిని, ఆలోచనలలోని సంకీర్ణతని, ఆవేశాన్ని కూడా అందిస్తుంది. అందుకే పదచిత్రం పద్యాన్ని కాలపు చెదపురుగులనుండి కాపాడే నేఫ్తలిన్ అన్నాడు C.M.Bowra. టూకీగా చెప్పడంగాని, వివరించడం గాని కవనవ్యాపారం కాదు. అందించడమే దాని పని. ఆపనిని పదచిత్రం చేస్తుంది. తెలుగు వారికి పదచిత్రాన్ని పరిచయం చేసింది కృష్ణశాస్త్రి పద్యశిల్పం.

తెట్టెను తొలగించి పద్యాన్ని పరిశుద్ధం చెయ్యాలన్నది కృష్ణశాస్త్రి చూపు. పద్యం ఓజస్సును దిగజార్చే టొంపల్ని, దాని నడకల్ని నాన్చే అడ్డుకట్టల్ని తొలగించి పద్యంలో గూడుకట్టుకొని ఉండే సహజధ్వనులను అందించే లావణ్య ప్రవాహాన్ని, ఔజ్జ్వల్యాన్ని సంరంక్షించడానికి పూనుకున్నాడాయన అందుకే ఆయన పద్యాలు ఆనందభంగమాలికలు

పద్యాన్ని నేలకు వచనానికి బంధించి ప్రజ్ఞాచక్షువుకు ప్రతిబంధకంగా నిలిచే బోధకత్వ ధోరణిని, పద్యానికి చరమలక్ష్యమైన లోకాతిక్రాంత సౌందర్యాన్ని సొంతం చేసుకునే ఆత్మ ఉడ్డీనానికి అడుకట్టల్ని కట్టే తర్కభుక్తిని తలదన్నే ఉన్మత్తభావశాలిత భావకవితకు ప్రాణస్పందన అయింది. అందుకే కృష్ణశాస్త్రి 'దిగిరాను దిగిరాను దివినుండి భువికి' అన్నాడు.

'ఎలుతురంతామేసి ఏరునెమరేసింది' అంటాడు నండూరి ఆ ఏరు కవి ఊహాశాలితకు మేత ఊహదానిని జీర్ణించుకుని రూపాంతరీకరిస్తుంది. దృశ్య ప్రపంచమంతా ప్రతిమల, సంకేతాల సమాహారమే కవి ఊహారసజగత్తులో వాటికి ఒక స్థానాన్ని, విలువను కల్పిస్తుంది. సంకీర్ణచిత్రాల సమగ్రరూపం పద్యం అందులోంచి దాని ఆత్మలక్షణాన్ని వెలికితియ్యాలి. ప్రతీక సాంద్రత పద్యానికి లక్షణమయింది. దాని అందీ అందని చేలాంచలాలను అందుకోవాలి. దృశ్యజగత్తులోని పదార్థాలు సూచించే సత్యాన్ని, వాస్తవాన్ని కొందరు క్రాంతదర్శులు మాత్రమే చూడగలరు. 'దృక్కు దృశ్యమును భిన్నములు - ఏగతి దృక్కుదృశ్యమౌనిది యెఱుగంగ రాని మతిహీనుడ,

నిన్నును జూడనెంచెదన్' అన్న విశ్వనాథ ఆధ్యాత్మిక చింతన అక్షరాలా కవితాదర్శనానికి కూడా వర్తిస్తుంది. దృశ్య ప్రపంచ ఆవరణాన్ని ఛేదించుకొని అలౌకికసౌందర్యా వరణంలోకి దూసుకుపాయే వారే క్రాంతదర్శులు దృశ్యానికి అదృశ్యం, రవానికి నీరవం, స్పర్శకు అస్పర్శ పునాదులన్నాడు Navaris అందుకే 'రవం నీరవానికి డిమిన్యూటివ్' అన్నాడు నారాయణబాబు. ' ఎద్దియో అపూర్వమధురరక్తి స్ఫురియించుకొని అర్థమ్ముకాని భావగీతమ్ములవియె' అన్న కృష్ణశాస్త్రి పద్యశిల్పంలోని అంతరార్థమిదే

"To the depths of the unknown
to find the new
a mad desire to touch
any where out side the world"

అన్న బాదలేరు ఆర్తి ఎలాంటిదో ' ఇది ముగియబోని ఏ యర్థ మెరుగరాని పేసటే లేని వెట్టి యన్వేషణమ్ము' అన్న కృష్ణశాస్త్రి శోధన అలాంటిది. కృష్ణశాస్త్రికి ఎప్పుడూ ఒక్కలోకం చాలదు 'మోయలేనింక లోకాలతీయదనము' 'భువనములు దుర్భరానందమున మునుగ' అంటూ లోకాలోకం చేసే గంధర్వుడాయన. ప్రతిమలకు, 'ప్రతీకలకు - మానవ మేధకు సాపేక్షమైన స్థానాన్ని, విలువను కలిగించేది కవి ఊహాశాలిత. తన ప్రతిభకు, బుద్ధికి అందిన అవస్థితదృశ్యాలకు వ్యవస్థాత్మక పునస్సృజన చేయడం కవివ్యాపారం. అదొక నిర్దిష్టమైన స్థితికి చెందిన నిర్దుష్టమైన ఆత్మాభివ్యక్తి పద్యంలో నేలంటుని వదలి కవి ఆత్మ తన అలౌకిక జన్మభూమిని చేరుకుంటుంది. అందుకే మరోలోకానికి, ఆత్మలోకానికి తెరతీయడమే పద్యంపని. అప్పుడు కవితోపద్యంతోపాటు మనము దృశ్య ప్రపంచపు సంకుచిత పరిధుల్ని చీల్చుకుని అనంత విశ్వంలోకి రెక్కలు విచ్చుకుంటాము. అదే కృష్ణశాస్త్రి స్వేచ్ఛాగానము

ఆకు - పువ్వు మన కళ్లముందున్న ప్రాకృతిక వస్తువులే. వాటిలో అతిమానవ శక్తులేవీ లేవు కానీ ' ఆకులో ఆకునై పూవులో పూవునై ఈ అడవి దాగిపోనా ఎటులైన ఇచటనే ఆగిపోనా' - అనే పాటలో ఆత్మ తన మూలశక్తితో, లక్ష్య శుద్ధితో దానిలో వేళ్లు తనుకున్న ప్రకృతికి దూరంగా ఉండే అలౌకిక జన్మభూమికి దానిని తరలించింది. ఆనందలోకాలకు విస్తరించిన ఆ ఆత్మ, చైతన్యమై ప్రకృతిలో వేరువేరుగా విసరివేయబడిన వస్తుసంచయాన్నంతటిని తిరిగి ఒక క్రమబద్ధమైన సమగ్రతకు తరలించుకుని వస్తుంది. పాట కట్టడానికి జీవనాడియైన చైత్రనదీగర్భంలాంటి స్వచ్ఛశిల్పం ఈపాటలో తొణికిస లాడింది. ఆ సారళ్యం, తారళ్యం కలిసి సిద్ధించిన పాటలు అరుదు.

భావాన్ని ఒక అర్థం అనే రాటకు కట్టకుండా, పదాన్ని ఇంకొకరిపక్కన పడుకోబెట్టకుండా, పద్యాన్ని మడత బందుకీళ్లతో కట్టే శిల్పంలో పద్యం తన జీవశక్తులన్నింటినీ వెయ్యిరేకుల్లో వెదజల్లుతుంది అందులో పాఠకుడికి అపరిచిత - అచుంచిత - అద్భుత అనుభూతి లభిస్తుంది. మంత్రముగ్ధుల్ని చేసే మాదకత్వం సిద్ధిస్తుంది అప్పుడే ఆమె కన్నులలో - నీలినీడలు - నిదురచాయలు ఇరులగుసగుసలు - బాష్పములు కనిపించి, క్రమ్మి, వినిపించి, పొంచి ఉంటాయి.

ఒక్క పృథ్వీ గంధాన్ని వదలిన మేఘసాంగత్యంలో పద్యాన్ని అలకాపురికి పంపించాడు

కాళిదాసు ఆధునిక పద్యానికి పాంచభౌతిక శరీరంతో సాంగత్యం లేదు దాని కున్నదల్లా ఆత్మే దాని సాంగత్యమూ ఆత్మతోనే అక్కడ శబ్దం వినిపించదు స్పర్శ స్పృశించదు రూపం కనిపించదు రసం రుచి నివ్వదు గంధం వాసించదు. కథకు తిలోదకాలిచ్చిన ఆ పద్యంలో వాటి ధర్మాలన్నీ కలగాపులగంగా ఉంటాయి సహృదయపాఠకుడు ఆ పద్యపరిమళాన్ని పీల్చుకునేదాకా అందులోని వాక్యనిర్మాణం, పద సంబద్ధత అంతర్నిహితంగా అదృశ్యంగా ఉంటాయి. ఆ పద్యం ఎదలో రొద చేస్తుంది 'నవానూన విస్తృత వ్యోమయానాల వెడలివెడలి, భావ లోకాంచలమ్ములలో' వాలిపోతుంది చీకటితీగలు నక్షత్రపుష్పాలను పూయడం, కన్నీటి కెరటాల్లో వెన్నెల కురియడం, బ్రతుకెల్ల కోటిగొంతుల విడి సోనలై నూతన గీత సుధా పథాలలో పొరలడం వంటివి అప్పుడే జరుగుతాయి మానవీయమైన అనుభవాలు, తర్కాలు, విశ్వాసాలు - వర్ణన శక్తుల్ని అధిగమింపజేసి మానవుడి జీవితాన్ని ఉదాత్తం చేసే శక్తి ఈ నిర్మాణశిల్పంలో సిద్ధిస్తుంది కవిత్వానికొక మార్మికత, తాత్త్వికత ఇక్కడ లభిస్తుంది అది మనసులోపలి పొరల్లోని అజ్ఞాత సీమల్ని శోధించే శక్తి సాధక మవుతుంది. ఉద్రేకాలకు, ఉత్తేజిత శక్తులకు ఒక విశ్వసనీయత కలిగి 'మనసుకు సంపూర్ణ స్వేచ్ఛ లభిస్తుంది అప్పుడు 'నా ఇచ్ఛయే గాని నా కేటి వెఱపు' అన గలుగుతాడు కవి.

**ఉపయుక్త గ్రంథాలు**


1 కృష్ణశాస్త్రి కృతులు

2 ఎంకిపాటలు

3 రుధిరజ్యోతి

4. రామాయణ కల్పవృక్షము

5. మేఘసందేశము

6 ఉత్తర రామచరితము

7 The sense of beauty - santayana

8. A History of Literary Aesthetics in America

9. The Literary Text - An Examination of Critical Methods. P.M.Wetherill.

10. Literary Criticism: A short History. Wimselt & Brooks.

11. Baudelaire - Emid starkie

12. From Baudelaire to Surrealism Marcel Raymond

13. Poetry - A Modern Guide to its under standing and enjoyment - Elizabeth Drew

14. The creative Experiment - C.M. Bowra

15 Towards a theory of creativity - C.R. Rogers.

16. The key to Modern poetry - Lawrence Durell

17 వ్యాసరత్నావళి - మల్లాది సూర్యనారాయణశాస్త్రి.

18 నాట్యశాస్త్రము



**D H Lawrence**

MISI/మిసిమి Regd No 45042/90 Telugu Monthly Hyderabad-500 020 Postal Regd No H/SD




Camilo José Cela

*"for a rich and intensive prose, which with restrained compassion forms a challenging vision of man's vulnerability"*

**1989 Nobel Prize in Literature**